శ్రీ

# సంగీతశశిరేఖ.

## (అయిదంకముల నాటకము.)

ఇందులకీర్తనలు

రాజమహేంద్రవరము నందలి, శ్రీచింతామణి నాటక
సమాజమున యాక్టరగు,

అల్లక చంద్రశేఖర కవిచే

రచియింపఁబడి



రాజమహేంద్రి బుక్కుసెల్లర్సు

కర్రా అచ్చయ్య అండ్ సన్సు వారిచే

ప్రకటింపఁబడినది.

రెండవకూర్పు 1000 ప్రతులు.

కాకినాడ.

స్కేప్ అండ్ కో., ముద్రాక్షరశాలయందు ముద్రితము.

1923



[వెల. రు 0—12—0

# ఈనాటకమునందు వచ్చు పాత్రలు.

పురుషులు.

నారదుడు.

బలరాముడు.

కృష్ణుడు

అభిమన్యుడు.

విష్ణుశర్మ.

ఘటోత్కచుడు.

దుర్యోధన భీష్మ ద్రోణకర్ణాదులు.

ఇంద్రుడు.

స్త్రీలు.

రేవతి.

నర్మద.

శశిరేఖ.

భారతి.

సుభద్ర.

హిడింబ.



శ్రీ

# శశిరేఖాపరిణయము.

## ప్రథమాంకము.

[సమాజికులందరుకలసి తెరలోపాడెడి ప్రార్థనపాట.]

కళ్యాణిరాగం-ఏకతాళం.

పల్లవి—శ్రీకరగిరివర శుభకరశ్రితజనరక్షణాభరణ॥

అ-ప॥ ఓకరుణాకరహారహార । యోగీంద్రహృద్విహార

శాంకరీమనోరమణ॥ ॥శ్రీకర॥

ప్రకటితమగునీమహిమలు । పరికింపగమహాద్భుతము ।

శ్రీకంఠా మముబ్రోవుము॥ ॥శ్రీకర॥

లోకమున నిన్నుబోలిన పోషకులెవ్వరుగానరు ।

సాకుముయీసామాజీని ॥ ॥శ్రీకర॥

[ద్వారకాపురము:—ప్రవేశము-నారదుడు.]

[నారదుడు ప్రవేశించి పాడెడిపాట.]

మోహనరాగం-ఏకతాళం.

పల్లవి॥ యెంతసుదినమీదినము । యెంతధన్యతజెందెనాదు

జన్మము। ఆహా॥

అ॥ ప॥ సంతసమున నోలలాడుదు । సతీసహితుఁడైకృష్ణుఁడు అంతరం
గమానంద మొంద నాకుదర్శనంబిడె ॥యెంత॥
యెంతనివర్ణింతునాతని । దివ్యకాంతివిశేషము।
సంతసించువారికికను। సంతసము సుందరవదనము ॥ఎంత॥

నార—ఆహా ! నేడెంతయు సుదినము. సౌందర్యవంతుఁడగు శ్రీకృష్ణుని దర్శించుభాగ్యం బబ్బుటంజేసి నాస్వాంతం బెంతయు సంతోషదాయకంబై యొప్పుచున్నది. కానియీమధ్య కలహం బెచ్చటను వీక్షింపకుండుటచే నాకేమియుఁ దోచకున్నది. కలహభోజనుండనఁగ నాకుఁ గలహ మీక్షింపని దినంబు లంఘనమే కదా. ఎట్లైనను నిప్పుడెచ్చటనైనఁ గలహంబు గల్పించి నాకడుపు నిండించుకొనవలెను. ఇందుల కేమిసేయుదును. (ఆలోచించి) సరే. జ్ఞప్తికివచ్చినది. శ్రీకృష్ణుని కగ్రజుండగు బలరాముండు తన పుత్రికయగు శశిరేఖను మేనల్లుండగు నభిమన్యునకిచ్చి పరిణయముసేయుదునని వాగ్దత్తము చేసియుండెనని వినియున్నాఁడ. ఇయ్యది నాకుఁ గలహంబునకు మంచిమార్గంబు జూపించుచున్నది. హస్తినాపురాధీశ్వరుండగు దుర్యోధనుండు బలరామునకు శిష్యుఁడుకదా. ఇప్పుడు నేను హస్తినగరంబునకేగి సుయోధనునిఁజూచి యతనిపుత్రుండగు లక్ష్మణునకు బలరాముని కూతురగు శశిరేఖనిచ్చి పరిణయముసేయుమని యడుగునట్లు జేసెద. సుయోధనుండును నా మాటకైన బలరామునకు వార్తబంపును. బలరాముండును శిష్యవాత్సల్యమును ద్రోసివేయఁజాలక నభిమన్యున కిచ్చెదనన్న వాగ్దానంబు ద్రోసిపుచ్చి, శశిరేఖను లక్ష్మణున కిచ్చుటకు సమ్మతించును. ఎట్లైనను కృష్ణుండీకార్యంబున కంతరాయము గలిగించును. తుదకు శశిరేఖాభిమన్యులకే వివా

హంబు జరుగును. ఇంక సేనాలోచింపనేల. తత్క్షణంబే కరిపురంబునకేగి సుయోధనుని జూచెద.

(నిష్క్రమించును.)

ఇదిశుద్ధవిష్కంభము.



బలరాముని సౌధము.

[ప్రివేశము:—బలరాముడు, రేవతి, నర్మద.]

బలరాముడు రేవతితో జెప్పెడిపాట.

కాఫీరాగం-ఆదితాళం.

పల్లవి॥ వినుమాసతిరేవతీ। విశదముగను వివరించెదనాడగు స్వాంత
మందుగల్గినవంతన్ ॥ ॥విను॥

అ-ప॥ గనుగొనధర సంసారపారావారము తరించులేకను కష్టము।
తనయులోగవినన్ తథ్యంబుగ స్వాంతంబు నంతచేజెలంగు
జుమా ॥ ॥వినుమా॥

మనకులేక లేకను శశిరేఖపుట్టెనంచు నేపుట్టెడాశతోమనుచుం
డగ నింతలోన తనయన్ పరులపాలుజేయగవలసెన్॥విమా॥ను

బల—(రేవతింజూచి) రమణీ! ఆడపిల్లలంగాంచువారి భాగ్యం బింత
టిదేకదా ?

రేవ—నాథా! మీరేల యిట్లు చెప్పుచుంటిరి ?

బల—ఏమున్నది.

మ. నవమాసంబులు మోసిమోసి కని నానా కష్టముల్ బొనిది, శై
శవబన్మోత్కటబాధలన్ సయిచి, సత్వంతోషముగ్ బూనిపెం

చి వినోదించిన పుత్త్రికామణులఁ; రా శ్రీజీవాక్షిరో; గాంచుటల్
యవనిఁ వేరొక హస్తమందిడుటకే శ్రీ యాత్మఁ విలోకింపఁగన్

రేవ—నాథా! అట్లుగాక నాకుపిల్లలెప్పుడును బుట్టినింట నుండురా!
ఆడువారింగాంచుట యొకరిహస్తమందుఁ బెట్టుటకే.

బల—తరుణీ! ఇంతవరకును నేను మనశశిరేఖ వివాహవిషయమై
తలపెట్టక యుంటిని. కుమారిక యుక్తవయస్కురాలైయున.
ఇంక వివాహము చేసితీరవలయును. అబ్బా! వరాన్వేషణము
మిగుల కష్టముకదా!

మ. ధనముఁగానఁగరాదు; కల్గినను విద్యా చూడఁగానున్న; యా
ధనవిద్యల్ గలుగన్; భుజాబల మబద్ధంబౌను వీక్షింపఁగా
ధనవిద్యాబలమున్న సుందరత తథ్యంబొప్పఁగానుండదా
ధనవిద్యాబలరూపముల్ గలుగు భర్తంగూర్ప సామాన్యమే

రేవ—అట్టికష్టము మన కేమియు లేదుకదా!

బల—మనకుమాత్త్రమేల లేకుండును. ?

రేవ—ఇంట మేనల్లుండగు నభిమన్యుం డున్నవాడుకదా.

బల—సరి. దీనికేమి! రమ్యక్షి! అభిమన్యుండన్న మనశశిరేఖకు ఇ
ష్టమేనా!

రేవ—బాల్యంబునందుండియు నొక్కచోటనే పెరిగి యొకరినొకరెప్పుడును నెడబాయక యుండుటంజేసి, శశిరేఖ యభిమన్యు
యందు బద్ధానురాగయై యుండునని యే నానిశ్చితాభిప్రాయము. బాలికయగు శశిరేఖ యయ్యది పైకి వెల్లడించునా!

బల—అయినను చేష్టలచే దెలియవచ్చునుకదా. (నర్మదంజూచి)
నర్మదా! నీవేగి శశిరేఖం దోడ్కొనిరమ్ము.

నర్మ—[నిష్క్రమించి వెంటనే శశిరేఖతోఁ బ్రవేశించుచున్నది.]

బల—(శశిరేఖం జూచి) పుత్రీ! శశిరేఖా! ఉపవిశ్యతాం.

శశి—(తండ్రిని సమీపించగా నతనిప్రక్కనుఁ గూర్చుండ జేయును.)

బల—(నర్మదంజూచి) నర్మదా! నీవెందరినో రాజకుమారుల నెఱుంగుదువు కావున గొందరినిఁ బేర్కొనుము. అందు మనశశిరేఖ కెవ్వరీడగుదురో చూచెదను.

నర్మ—దేవా! నేనిదివరలోఁ గొన్ని రాజకుమారుల చిత్రపటంబులు సంపాదించి యుంచితిని. అవి దెచ్చి తమకుఁ జూపించెద. (నిష్క్రమించి వెంటనే చిత్రపటంబులతోఁ బ్రవేశించును.)

బల—నర్మదా! చిత్రపటంబులు దెచ్చితివా?

నర్మ—దేవా! తెచ్చితిని

బల—ఏదీ! ఒక్కొక్కపటంబునే చూపించుచు యా యా రాజకుమారుల గుణశీలాది విశేషంబులంగూర్చి తెల్పుము.

నర్మ—చిత్తము. (ఒకొక్క చిత్రపటంబె జూపుచు)

వనమంజరీవృత్తము.

కనుఁగొనుడీతఁడు కేరళదేశపు । క్ష్మాధవాత్మజుఁడౌనుగా
ఘనమగు సుందర రూపమునందునఁ । గాముని హాసియించుగ
వనితకు నీతఁడు నీడగునంచును । భావమందుఁ దలంతుగా
జనవర యిందులఁ గూర్చియుమీదగు । స్వాంతమందెటులున్నదో.

బల—ఈతనకొక్క సౌందర్యముతక్క తక్కిన గుణంబు లేవియు నులేవు.

నర్మ—(వేరొక పటంబునుఁ జూపుచు)

మనోహరవృత్తము:—మగధదేశమేలు । మహీతుఁ డీతఁడెన్నఁగా
సుగుణసాంద్రుఁడనుచు । సుజను లెంతురీతనిన్

జగతియందుపేని  సముఁడు లేడుసూడఁగా
మగువ కీడెయగుచు  మనమునన్ దలంచెదన్.

బల—ఈతనిని నే నెఱుంగుదును. మరియొక్కని వక్కాణింపుము

నర్మ—దేవా! ఇటుజూడుడు. (వేరొక పటముదీసి)

మ. ఇతఁడాయుగన్నృపాలపుత్రుఁడు; పవిత్రా  పేక్ష్యుండు, ధీరుండు సం
తతకల్యాణసురూపమూర్తి ఘనవి  ద్యావార్ధి శాంతుండు, నా
యతబాహాబల సంపదుండు; వృషసే  నాభిఖ్యతన్ వెల్గెడిన్
సతి కీడౌనని యెంచెదన్ మనములో  సర్వంసహా వల్లభా.

బల— ఈతని నెవ్వరెఱుంగరు నర్మదా!

తే. గీ. ఎన్నియో సంపదలుగల్గి  యొగడనిమ్ము
ఎంతయో శౌర్యమునుబూని  తొనఁగనిమ్ము
విద్యయెంతైనఁబఠియించి  వెలఁగనిమ్ము
కులమునందున దక్కువై  చెలఁగుఁగాదె.

రేవ—నాథా! ఏమి! యిట్లుసెలవిచ్చితిరి?

బల—నీవెఱుఁగవు కాబోలు!

ఉ. ఈతనితండ్రికర్ణుడు న  హీనపరాక్రమవిక్రముండు, తా
సూతునకుం జనించి యిటు  శోభనగాత్రిరో చేరె కాంచన
వ్రాతము; నాసుయోధనుని  భవ్యకృపన్ నృపుఁడయ్యె నంతనే
సూతకులంబుఁ బోవునెకో  సొంపుగ క్షాత్రకులంబు వచ్చునే.

ఈతనికేమి మరియొక్కనిని వక్కాణింపుము.

నర్మ—(వేరొక పటంబుఁజూపి) దేవా! ఈతనినివీక్షింపుఁడు.

ఉ. మాళవరాజనందనుఁడు  మాన్యచరిత్రుఁడు శాంతమూర్తి! భూ
పాలకులాగ్రగణ్యుఁడు సు  భాస్వుఁడు; విద్యలయందు బెద్ద, యీ
బాలిక నేలఁగాఁదగిన  వాడని యెంచెద సూనుడయ్యె; గో
పాలకులావతంస జన  వంద్య! గుణాకర! రేవతీధవా!

బల—అన్నియు నీతని యొద్దనుండెను గాని, చక్కదనము మాత్రము లేదు.

నర్మ—(మఱియొక పటంబుఁజూపుచు)

[అభిమన్యుని పటము బలరామునకుఁజూపుచు
నర్మదపాడెడి పాట.]

బేహాగ్ రాగం-ఏకతాళం.

పల్లవి. ఓబలపరాక్రమ విరామా । బలరామా ॥
అ. ప. యీబాలుఁడు కఁడు । ధీరుఁడు శూరుఁడు । యిందునిభాస్యుఁడు ।
యింద్రునిపౌత్త్రుఁడు॥ ॥ఓబల॥
మీబాలికకుఁ । తగుయందగాఁడు । మీకగువాడు । దలచి
చూడగన్॥ ॥ఓబల॥
సేబాసనరే । యీజగమంతట । యిరువురియీడుఁ । జో
డుఁగనినఁ । ॥ఓబల॥
సుభద్రాత్మజుఁడుఁ । మీమేనల్లుఁడుఁ । సుగుణగణుండుఁ అ
భిమన్యాభిఖ్యుఁడుఁ ॥ ॥ఓబల॥

సీ. పాకారిపౌత్త్రుండు ఽ ఫల్గునపుత్త్రుండు
మీకుమేనల్లుఁడ ఽ మేయగుణుఁడు
బాల్యంబునుండియు ఽ మనగృహంబందునే
పెఱుఁగుచుఁబెద్దయై ఽ వెలసినాఁడు
బలశౌర్యములయందు ఽ పార్థుఁహాసియించి
విలసిల్లగాఁజాలు ఽ వీరవరుఁడు
సౌందర్యమందున ఽ జంద్రునిఁబురడించు
విద్యలన్నియునేర్చి ఽ వెలిగెనాఁడు

తే. గీ. వనిత శశిరేఖ మాయింపం బయంగనొప్పు
ధనము దొంగిలించినయట్టి తస్కరుండు
మాన్యగుణతేజఁడౌ యభి మన్యుఁడితఁడు
కన్నె కీడగునంచును నెన్నుదాన.

బల—ఈతని సంగతి కేమిలే. అభిమన్యుని సంగతి నెఱుంగమనియా నీవు చెప్పితివి. సరే, వేరొకరినిఁ జెప్పుము.

నర్మ—(వేరొకపటంబును జూపించి)

మత్తకోకిల.

కౌరవేంద్రుని కూర్మిపుత్రుఁడుఁ గామసన్నిభ రూపుఁడున్
ధీరుఁడుత్తమ విద్యలందున ధీజనస్తుతి పాత్రుఁడున్
బేరునందున లక్ష్మణుండన వెల్గుచుండెను భూమినిన్
సారసాక్షి కిసీడటంచును సంతసంబున నెంచెదన్

బల—(చిత్రపటంబునుఁ జూచి) నర్మదా ! నీవు చెప్పిన రాకుమారుఁడు యందెల్ల నితఁడే తగియుండెను. ధనమా లోపము లేదు. విద్యయందా బృహస్పతికి సమానుండు. బలపరాక్రమంబుల గూర్చి చెప్పనక్కఱలేదు. మఱియు,

తే. గీ. ఛాత్రుఁడైనాకుఁగడుగదా సమరవిద్య
నభ్యసించెను నాయొద్ద హర్ష మెసఁగ
నట్టి దుర్యోధనసుతుఁడై యలరుఁగాదె
యింతకంటెఁ గావలసిన దేమి మనకు.

ఎల్లవిధంబుల నీలక్ష్మణుండే నాపుత్రికకుఁ దగియున్న వాఁడు. (శశిరేఖం జూచి) అమ్మా ! శశిరేఖా ! సుయోధనసుతుండగు లక్ష్మణుండు నీకుఁ దగియున్న వాఁడు. ఈతనిని నీకుఁ బరిణయంబు గావించిన బాగుండునుకదా.

శశి—(తలవంచుకొని తనలో) అయ్యో! బాల్యంబునుండియు నాకు భర్తయగునని సంతోషపడుచున్న నాకోరిక సాగదాయేమి!

రేవ—(బలరామునిఁ జూచి) మనోహరా! మేనల్లుడగు నభిమన్యుఁ డుండఁగా శశిరేఖను నొరుల కీయనేల?

బల—చాలుఁజాలు. ఇదివరకు సుభద్ర నాయర్జునునకొసంగి యింత సుఖపడుచుంటిమికదా. ఇంక శశిరేఖను నభిమన్యు కిచ్చి సుఖంతుము కాబోలు!

శశి—(బలరామునిఁజూచి) తండ్రీ నేను వనవిహారంబున కేగవలయును. నాకనుజ్ఞనిండు.

బల—అమ్మా మంచిది.

శశి—(నిష్క్రమించును.)

రేవ—(బలరామునిఁజూచి) నాథా! మీకు నేనుఁ జెప్పవలసినదాననుగాను. యుక్తవయస్కురాలైయున్న కన్యకకుఁ బరిణయము సేయునప్పుడామె మనంబెవ్వరిపై లగ్నమైయున్నదో యయ్యది యెఱిఁగి, వివాహం బాచరించినచో ననుకూలదాంపత్య మగునని పెద్దలు చెప్పుదురు. అభిమన్యుండు మీమేనల్లుఁడు. అదియుంగాక బాల్యంబునుండియు, నతఁడు మనయింటనే పెఱుగుచున్నవాఁడు. శశిరేఖాభిమన్యు లెన్నఁడును నొకరి నొకరి డఁబాసి యెఱుంగరు. శశిరేఖచిత్తంబు సౌభద్రునిపైఁ జిక్కియున్నదని యూమె బహిరంగముగ జెప్పకపోయినను నామె చేష్టలవలన దెలియును. ఇప్పుడు మీరు లక్ష్మణుని చిత్రపటంబు నామెకుఁజూపి, యతఁడు బాగుండెనాయని యడిగినప్పుడ నగీకార భావంబుఁజూపుచు తలవంచెను. ఇయ్యది మీరె యెఱిఁగియే యుందురు.

బల——నీవు నాకుబోధింప నవసరములేదు. ఈమాత్రపు వాక్యము
లు నాకును దెలియును. కూతుగుడ్డలులేక మనగృహంబున
జేరియున్న యభిమన్యునకా శశిరేఖనిమ్మని యుపదేశము నే
యుచుంటివి. చాలు-చాలు. ఇంక నీవీప్రశంసc గట్టిపెట్టుము.

సేవకుఁడు——(ప్రవేశించి బలరామునిఁజూచి) దేవా! ద్వారముకడ
నొక్క భూసురాగ్రణి దేవరదర్శనార్థమై వేచియున్నాఁడు.

బల——శీఘ్రంబుగ లోనికిఁ బ్రవేశపెట్టుము.

సేవ——చిత్తము. (నిష్క్రమించును.)

[వెంటనే విష్ణుశర్మ ప్రవేశించును]

విష్ణు——(తనలో) అబ్బా! ఆహస్తినాపురినుండి యీద్వారకాపురము
జేరునప్పటికి నాపంచప్రాణంబులలో రెండు ప్రాణంబులు పో
యినవి. ఈపెండ్లియగునోలేదో తెలియదుగానినా పెండ్లిమాత్ర
మయినది. అన్నా ఆకౌరవేంద్రుఁడెంత మూర్ఖుడు. ఆనార
దునిమాటలువిని బలరామునియింట నతని మేనల్లుఁడగు నభి
మన్యుండుండెనని యైనను తలంపక, లక్ష్మణుఁకీతని పుత్రి
నిమ్మనికోర నన్నుఁ బంపెనుగదా. ఒకవేళ శిష్యవాత్సల్యం
బునఁజేసి బలరాముండిందుల కంగీకరించునని కొందము. కా
ని, పాండవపక్షపాతియగు శ్రీకృష్ణుండీ వివాహంబున కంతర
యంబు గల్గించకమానునా. కానిమ్ము. ఏది యెటులున్న నా
మి! రానుపోను దారిఖర్చులు దెట్టింపుగ నిచ్చిరికదా. అక్క
డధోవతులచాపు ముట్టినది. ఇక్కడ ముట్టగలదు. ఇదుగో
బలరాముఁడు భార్యాసహితుఁడై యున్నాడు. ఇంక నేనే
మర్యోధనుని సందేశంబు నీతనికిం దెల్పెదగాక. (ప్రకాశము
గా) జయము. జయము బలరామా!

బల—(ఆసనంబునుండి లేచి భూసురునింగనుంగొని) భూసురాగ్రగణ్యా నావందనంబులం గైకొని యీయాసనంబధిష్ఠింపుఁడు.

విష్ణు—సౌభాగ్యసిద్ధిరస్తు! (అని యాసనంబునఁ గూర్చుండును)

బల—మహాత్మా! మీరెందుండి వచ్చుచుండిరి. ఏమికార్యార్థమై నాకడకరుదెంచితిరి?

విష్ణు—నేను హస్తినాపురమునుండి వచ్చుచుంటిని. నాపేరు విష్ణుశర్మయందురు. కౌరవేంద్రుని పంపున నీకడకరుదెంచితిని.

రేవ—(తనలో) తలపని తలంపుగా నీభూసురుండు శశిరేఖను లక్ష్మణునకీయమనికోర, కౌరవేశ్వరుఁడు చెప్పి పంపగా రాలేదు కదా!

బల—అయ్యా! మీరు సుయోధనునికడనుండియే వచ్చుచుండిరా?

ఉ. సేమమె యాంబికేయుఁడును సేమమె కౌరవరాజచంద్రుఁడున్
సేమమె వానితమ్ములును సేమమెవారల కాంతలెల్లరున్
కాముని గేరుసుందరుఁడు కౌరవరాజసుతుండు సేమమా
భూమిసురోత్తమా వినఁగ మోదముప్పుట్టెను చెప్పుమీ వెసన్.

విష్ణు—అయ్యా! అందరును సేమంబుగనే యున్నవారు. ఆదుర్యోధనచక్రవర్తి పంపుననే కదా నేను నీకడకరుదెంచితిని.

బల—ధరామరవర్యా! సుయోధనుండు మిమ్ములనునేమికార్యార్థమై నాకడకంపెనో నాయందుఁగృపఁబూని సెలవిచ్చెదరా?

విష్ణు—త్రిజగత్స్తవనీయ సుందరాంగి యగు నొక్క కుమారిక నీకు కలిగియుండఁగా సుయోధనుండు నన్నేలపంపెనో కారణము నీవెఱుంగకుందువా!

బల—(తనలో) ఏమిదీ! తలవని తలంపుగా నాకోరిక ఫలించునుగాబోలు.

విష్ణు—ఆలోచించుచుంటివేమి? నావాక్యార్థంబుదలి యర్థము నీవు గ్రహించలేకపోయితివా యేమి!

మత్తకోకిల

కౌరవేంద్రుఁడు హరపాటుఁ గాంక్షమీఱఁగ వచ్చితిన్
సారసాక్షి త్వదీయపుత్త్రిక క్ష్మాతలంబున నాతఁడిం
పారఁ గోడలుగాఁగఁ గైకొన నాత్మయందున నెంచిరిన్
గోపముంచుము చెప్పవాకును గోర్కెతో గుణశేఖరా.

బలవిక్రమోద్దామా! బలరామా! నీపుత్త్రికయగు శశిరేఖను తనపుత్త్రుండగు లక్ష్మణునకిచ్చి పెండ్లిసేయ మహాకౌతూహలాయత్తచిత్తుండై కౌరవేంద్రుండున్నాఁడు. పెద్దలగు భీష్మద్రోణులును నిందులకంగీకరించిరి. కౌరవేశ్వరుని సంపదతిశయమై నీకు తెలిసియేయున్నది. మఱియు నీకుఁబ్రియశిష్యుండు. ఇంక లక్ష్మణుని రూప సౌందర్యంబులం గూర్చియు, బలపరాక్రమంబులగూర్చియు, విద్యాబుద్ధులంగూర్చియుఁ బ్రత్యేకనేను జెప్పనక్కరలేదు. మీరును మీరును నిదివరకే బంధువులై యుండిరి. ఇంకనిప్పుడు నీవు శశిరేఖను లక్ష్మణునకొసంగి పరిణయముగావించితివేని, బంగారంబునకుఁ బరిమళ మబ్బినట్లుండును.

బల—భూసురోత్తమా! పెద్దలగు భీష్మద్రోణులాలోచించి చేయుదలంచినయికార్యము వలదనునంతటి సాహసుండనా! దుర్యోధనుని చుట్టరికంబుకన్న నాకుఁగావలసిన దేమున్నది?

విష్ణు—వివాహనిశ్చయంబుదు పిల్లమెడ తండ్రికంటెను తల్లులకెక్కువ బాధ్యతయుండునుకదా. (రేవతింజూచి) అమ్మా! రేవతీదేవీ! ఈసంబంధము నీకిష్టమేకదా!

రేవ—భూసురోత్తమా! మీరట్లనిగెదరేల! నాథుని చిత్తవృత్తికి నేనన్యథా ప్రవర్తింతునా. నాథునిచిత్తమెట్లో నాచిత్తమునకు నట్లే.

విష్ణు—(తనలో) ఈమాటలు మూలకముగా నీసంబంధమీమోక్షమును లేకున్నది. కానిమ్ము. నాకేమి (ప్రకాశముగా) బలరామా! ఇంక నాలోచింపనేల. "శుభస్యశీఘ్రి" మనువాక్యము వివాహముహూర్తము నిశ్చయించి సుయోధనునకుఁ దెలియనంపుదము.

బల—అయ్యా! మీకంటె శుభముహూర్తము నిశ్చయింపఁగల సమర్థులెవ్వరు! లగ్నముఁగూడ మీరే నిశ్చయించి సుయోధనునకుఁ దెల్పి సంబంధుపర్గంబుగఁ దోడి తెండు.

విష్ణు—(తనలో) లగ్ననిశ్చయమునకు గూడ నొక ధ్రోవతులచాపు పడునుకదా. (ఆలోచించి) బలరామా! నేటికిఁ బంచమియైదు దినంబులున్నది. పంచమీ లగ్నము మంచిదై యున్నది.

బల—మీచిత్తమెట్లో నట్లేకానిండు. వివాహముహూర్తము దగ్గరనే యున్నది. సత్వరంబుగ మీరేగి సుయోధనాకులను దోడ్కొనిరావలయును.

విష్ణు—ఇంక నేనేగివచ్చెదను.

బల—చిత్తము. (సేవకునిఁజూచి) సేవకా! నీవీభూసురోత్తమునిదోడ్కొనిపోయి మణిమయభూషణాంబరముల నిప్పింపుము.

సేవ—చిత్తము. (అనిభూసురునితో నిష్క్రమించును.)

[బలరాముడు శశిరేఖను దుర్యోధనాత్మజుండగు లక్ష్మణునకిచ్చి పెండ్లిచేయ నుద్దేశింప రేవతి తననాథునితోఁ జెప్పెడిపాట.]

కాఫిరాగం—ఏకతాళం

ప॥ నామనవి యాలింపు ప్రాణేశా॥

అ॥ ప॥ యేమనందు మీరెరుగనిధర్మము । లేమిగలవుగాని వచింతు
నిదె॥ నామన॥

ప్రేమతోడ చిన్ననాటనుండియు। బెంచిపెద్దవానిగ నొనరించిన
మీమేనల్లుడభిమన్యుకుండ । యితరాలోచన జేయనేల॥ నామన॥

రేవ—(బలరామునిఁజూచి) మనోహరా! మీరు చాలాతొందరప
డితిరని నాయభిప్రాయము.

బల—ఏమీ! ఇందు తొందరయేమున్నది?

రేవ—సద్గుణసంపన్నుండును, రూపశాలియు, బలపరాక్రమ విక్రి
ముండునునగు మేనల్లుండుండఁగాఁగన్యనొరులకీయనెంచుట
తగునా! చిన్ననాటనుండియుఁ దనకుఁగోడలగునని మీచెల్లెల
గు సుభద్రయెంతయో మురిసియుచున్నదే. పాపమామెయాశ
నిరాసఁజేయుట మీకుఁదగునా! ఇయ్యది విన్నచో నామెయెం
తగా వగచునోకదా!

బల—నీవీకార్యమునందు జోక్యంబు గలిగించుకొనకుము. నీకేమి
యు తెలియదు. పిల్లయొక్క సౌఖ్యము నేనుమాత్రము చూడ
ననుకొంటివాయేమి. అభిమన్యున కిచ్చినచో మనపిల్ల పసుపా
ట్లు చెప్పవలెనా. పూటకూటికి గతిలేక నడవులవెంబడి తిరు
గుటయేకదా. ఇట్టి సంబంధము సేయుమని చెప్పుటకునీకునో
రెట్లాడెను. కూతురుగొంతుకు గోయఁదలఁచితివాయేమి. ప్రసంగా
లు చాలు. నీవింక నీప్రశంస గట్టిపెట్టుము.

రేవ—నాథా! ఆగ్రహింపకుఁడు. పిల్లసౌఖ్యము కోరినదాసనగుట
చేతనే యట్లుచెప్పితిని. పోనిండు మీయిష్టమువచ్చినట్లే సే
యుఁడు.

బల—కాకున్నచో నీమాటవిని యకార్యము సేయుదుననుకొంటి
వాయేమి?

రేవ—(ఎదుటంజూచి) అదుగో మఱదిగారు కాబోలు వచ్చుచున్నారు ఇంక నేను లోపలికిఁబోయెదను. (నర్మదతో నిష్క్రమించును.)

[శ్రీకృష్ణుఁడు—ప్రవేశించును.]

బల—(కృష్ణునిఁజూచి) తమ్ముఁడా! కృష్ణా! ఇఁటుగూర్చుండుము.

కృష్ణు—(పీఠంబున నాసీనుఁడగుచున్నాఁడు)

బల—కృష్ణా! నీవింత తొందరగా వచ్చుటకేదియో యొక కార్యముండితీరును.

కృష్ణు—అన్నా! నీకుఁదెలియని కార్యముండునా! ఎన్నఁడును తలవని తలంపుగా దుర్యోధనుని పంపున వచ్చిన ధరావరునితో మన శశిరేఖను లక్ష్మణునకిచ్చి వివాహము గావించెదనని చెప్పుటయు, లగ్ననిశ్చయముగూడ జేసిపంపుటయుఁ దటస్థించినదే. అగ్రజా! నీకియ్యది న్యాయమనితోచెనా!

బల—ఇందన్యాయమేమున్నది?

కృష్ణు—అన్యాయమేమని యడుగుచుంటివా!

తే. గీ. ఎల్లవిధములఁదగినమే । నల్లుఁడింట
నుండ శశిరేఖనిప్పుడీ । వారులకీయ
దలచు టయ్యది నీకును । ధర్మమగునె
యెట్లుసాహసించితివి నీ । విట్లుసేయ.

బల—తమ్ముఁడా! నీమాట వింతగానున్నది.

తే. గీ. కన్నె శశిరేఖ నవనిపైఁ । గాంచినయది
పార్థసుతునకిచ్చుటకెనా । పలుకుమయ్య
యతఁడె వారిణేన్వరుఁడటంచు । నతివమోహము
నందువారైనా చెప్పుమీ । యయ్యజుండు.

కృష్ణు—అన్నయ్యా! మీపిల్ల కావున మీయిచ్చవచ్చినయట్లు సేయవచ్చును. దానికి నేనభ్యంతరము పెట్టువాడనుగాను. అయిన

ను నేనుగూడ శశిరేఖయొక్క సౌఖ్యము కోరవలసినవాడనే కదా. ఆకారణంబునఁ జెప్పుచుంటి.

తే. గీ. బాల్యమాదిగ మనయింట పెరిగినాడు
కన్నె శశిరేఖ కీడౌచుఁ గ్రాలినాఁడు
మనకుమేనల్లుఁడౌచును బఱగినాఁడు
కట్ట! యభిమన్యు విడుతువా కరుణలేక.

బల—కృష్ణా! ఏమి యిట్లు చెప్పుచుంటివి? అభిమన్యునికొఱకే యీ ధాతమనశశిరేఖను సృష్టించెనా యేమి? అభిమన్యునకే యిచ్చి తీరవలయునని శాస్త్రమా! నాయిచ్చవచ్చినవారికిచ్చి వివాహము కావించెదను.

కృష్ణు—అయ్యది నిజమే కాని, మున్నొకనాఁడు నీవు మన సోదరియగు సుభద్రతో శశిరేఖను నభిమన్యునకిచ్చి పెండ్లిసేయుదునని వాగ్దానము చేసియుంటివి. అయ్యది నీవు మఱచిపోతివి కాబోలు. సమస్తధర్మశాస్త్రసంవేదివగు నీవిట్టి యసత్యమునకు బాల్పడవచ్చునా!

(బలరాముఁడు కృష్ణుఁడాడిన పలుకులకుఁ బ్రతి పాడెడి పాట)

బేహాగ్ రాగం—ఏక తాళం.

ప॥ చాలుచాల్ నేమాటవినసకసిన । పలుకులన్ని । బాటిచేసి । యి
టులబల్క ॥చాలు॥

అ॥ ప॥ యేలగోపాలసేకివెఱ్ఱి । యించుకైన యోచింపవుగా చాలదా
యౌద్ధారనకు పరిణయము సన్నిధానములకు మనసహా డరి
చాలసౌఖ్యమునొందునుదా । ఘట్టింటనుబసియు ని ॥చాలు॥

బల—మాటలనరయసకన్న పలుకులను పాటించుచుము వాగ్దానముని చెప్పుచుంటివి. చాలు. చాలు. పలుకు పలుకుచుండగా సుభద్రను దీసికొనివెళ్ళియున్నునను గట్టిపెట్టితివి. దానంజేసెమున సుభద్ర,

యేమిసౌఖ్య పడుచున్నది. పతి యన్ననో యడవులపాలై చరింపుచున్నాఁడు. ఆమె యన్ననో కూడగుడ్డలులేక, పుత్రిసహితయై మనయింటనున్నది. ఇంక శశిరేఖనుగూడ నభిమన్యున కీప్పించి గొంతుగోయ నెంచితివా! చాలు చాలు. సప్తద్వీపసముద్రముద్రితమహీచక్రంబు బాలించుదుర్యోధన చక్రవర్తి తనూజుండగు లక్ష్మణుండేడ, కూడుగుడ్డలు లేక మనయింటఁ బెఱుగుచున్న యభిమన్యుడేడ?

కృష్ణు—మేనల్లుని విడిచి కన్యను నొరులకిచ్చినచో నలుగురును నవ్వరా! అదియుంగాక మీరు దుర్యోధనుని సిరికా యాశింపుచుంటిరి. అగ్రజా! నాపలుకులకు మన్నింపుఁడు. ఇంక మీరాయుద్యమంబును మానుఁడు. సోదరియగు సుభద్రకు కంటనీరుదెప్పించుట మనకు భావ్యముకాదు. ఆమెసంగతిగూడ మనమాలోచింపవలయునుకదా.

బల—తమ్ముడా! పుత్రికావివాహము సేయుచున్న నాకీలోకరితో నేమిపనియున్నది? ఎవ్వరైనను సంపదజూచి పిల్లనిచ్చెదరుగాని పూటకూటికి గతిలేక నడవులంబడి చరింపుచున్న వారికిఁ బిల్లనీయ సమ్మతింతురా. ఏమైనను సరే. ఎవ్వరికిఁ గోపమువచ్చినను సరే. నేనుమాత్రము శశిరేఖను నభిమన్యున కీయను. అఖిలసంపన్నుఁడైన సుయోధనసుతుండగు లక్ష్మణునకే యిచ్చెదను. ఇంకనీవు మారుపలుకకుము.

కృష్ణు—అన్నయ్యా! కౌరవులు మహాసిరిగలవారనియా నీవు సంతసపడుచుంటివి.

మ. వనవాసంబునుసల్పి యాపయిన శుంభద్దర్పమున్ బూనుచున్
రణరంగంబున ధార్తరాష్ట్రులను శస్త్రాంభోధిలోముంచి, స

జనులెల్లన్ బొగడంగ భూతలములో ౹ సర్వంసహామండలిన్
గొనఁగాఁ జూచెదవీవు పాండుసుతులన్ ౹ గోదండవిద్యానిధీ.

బల—కృష్ణా ! నీసంగతి యెవ్వరికిఁదెలియదు. ఏనాడు కౌరవులన నీవిష్టపడితివి.

ఉ. పాండవపక్షపాతము భ ౹ వన్మతమట్లు వచించెఁగాక, యా
ఖండల పౌత్రుఁడీడగునె ౹ కౌరవరాజకుమారుతోడ; యీ
పాండునృపాలనందనుల ౹ మాత్రము సేయరో ధార్తరాష్ట్రులిం
కుండుము మాటలాడకుము ౹ నొప్పుగ లక్ష్మణు కిత్తుఁబుత్రికన్.

మాధవా! ఇంక నీవాప్రశంస నెత్తకుము. లక్ష్మణునకు నొసంగి శ రేఖకుఁ దప్పక వివాహంబు గావించెదను. లగ్ననిశ్చయమైన ఇందుకు దప్పువాడనుగాను.

కృష్ణు—అగ్రజా! నేనెంత చెప్పినను నాపలుకులు మీరు వినకున్నా రు. కానిండు మీయిచ్ఛ వచ్చినట్లే సేయుడు. ఆ మహో వముకూడ మీరే చూచెదరుగాక.

[సుభద్ర యేడ్చుచుఁ బ్రవేశించుచున్నది.]

[సుభద్ర ప్రవేశించి బలరామునింజూచి పాడెడిపాట.]

మోహనరాగం—ఏకతాళం.

ప॥ అన్నా బలరామా । నావిన్నపమును మన్నింపుకృపన్ ॥అన్నా

అ॥ ప॥ఇన్నాళ్ళు మనశశిరేఖన్ । అభిమన్యుని కిచ్చెదననుచున్ న
వేడ్కించలేదా ॥అన్నా

చిన్ననాటనుండియు మీరే । చేతులార పెంచినారే । జెన్నలరగజూ
నారే । శశిరేఖకుతగునని నారే ॥అన్నా

సుభ—(బలరామునిఁజూచి)హా ! అగ్రజా । బలరామా ! ఎంత మ ము సేయఁదలంచితివి! శశిరేఖ యభిమన్యుని సతియనియే రియుచు, నలువురితోఁ జెప్పుకొనుచు సంతసింపుచుంటినే,

న్నయ్యా! శశిరేఖను నీకుమారున కిచ్చెదనని వాగ్దానముచేసి యుంటివే. దానికి భంగము సేయుట నీకుధర్మమా. ఇంతలోనే కౌరవరాజసుతుండగు లక్ష్మణునకిచ్చి పెండ్లి సేయ నిశ్చయించితివా! బాల్యంబునుండియు మీచే బెంచఁబడిన యభిమన్యుఁడు లక్ష్మణుండంతపాటి సేయలేదా. కౌరవులవలె మాకంత భాగ్యము లేకపోయినను మేనల్లుఁడని యైనను గరుణింపరాదా. మేనరికంబన్న సంతోషమునుగుటచే నిన్నింతబడికొట్టుకొనుచుంటి. (ఏడ్చుచున్నది.)

కృష్ణు—(సుభద్రంజూచి)

శా. అమ్మా! యగ్రజుతోడ జెప్పితిని తానే వాలింపఁడాయెంగదా
యిమ్మాడ్కిన్ మదియందునుంగుందెదవు నీ వేలాభవత్పుత్రకున్
గొమ్మల్ రాకనుయుందురే ధరణిలో గోర్కుల్ దగన్ దీఱవే
పోమ్మా! చింతనుమానియుండు మినినో పూబోడిగో సోదరీ.

సుభ—చిన్నన్నయ్యా! అభిమన్యునకు బెండ్లిగాదని నే నేడ్చుటలేదు. ఏదోగంతకుఁదగినబొంతరాకమానదు. మేనరికమున్న ముచ్చటపడుచుంటిని.

కృష్ణు—నీవు ముచ్చటపడినంతమాత్రమున నే సాగునా. అంతయు మనయిష్టమేనా. సకలమును దైవాధీనమని నీకుఁదెలియదా. ఇది యట్లుండనిరుపేదవై యున్న మీకు శశిరేఖనిచ్చుట కన్నగారికియిష్టములేదు. చంచలంబైన మహాభాగ్యంబులతోఁ దూగుచున్న యాకౌరవుల కీయనిశ్చయించిరి.

బల—(కృష్ణునిఁజూచి) కృష్ణా! నీవు పాండవపక్షపాతివని నాకుదెలియును. ముందు నివరుదెంచి, పిదప నీమెను బురిగొల్పితివా యేమి!

కృష్ణు—ఇందొకరు పురికొల్పవలసిన దేమున్నది. నీవిట్టి యన్యాయం బున కొడిగట్టితివన్న సంగతి యీమెకు మాత్రము తెలియ దా. అయినను నాకేల. మీయిష్టము మీయిష్టము. నాదారి నేఁబోయెదను. (కోపముతో నిష్క్రమించును)

**సుభ**—అన్నయ్యా! బలరామా!

సీ. నీదువియ్యామునంది ❀ మోదమందుదునంచు
నాసతో నిరతంబు ❀ నలరుచుంటి
శశిరేఖ నాపుత్రి ❀ జలజాక్షియంచును
నానందమెంతయో ❀ యందుచుంటి
తనపుత్రినీయ వా ❀ గ్దానమ్ముగావించె
నన్నయటంచును ❀ నరసియుంటి
పెండ్లియౌనంచును ❀ బిన్నపెద్దలముందు
బల్కుచుసంతోష ❀ పడుచునుంటి
తే. గీ. నక్కటా! సోదరా! నాదు ❀ యాసలెల్ల
మన్నుగల్పంగనెంచితే ❀ మనమునందు
న్యాయమే నీకునియ్యది ❀ యరసిచూడ
తగదుతగదంచుఁ జెప్పెదు ❀ తథ్యమిదియ.

సోదరా! ఇట్టి యకార్యముసేయుట నినుబోటిపురుషులకు దగదు. బాల్యంబునుండియు, శశిరేఖ నాకుఁగోడలగునని యెంతయో మురియుచుంటి. పాండవు లడవులంబడి చరింపుచున్నందుకే చింతింపుచుంటి. నాకిది యొకచింత దెచ్చిపెట్టితివా. ఇదినీకుధర్మమా! మున్ను శశిరేఖను నీసుతునకిచ్చి పరిణయము గావించెదనని వాగ్దానముచేసియుంటివే. దానికి భంగముగలిగింతువా. నావిన్నపమాలకించి నీపుత్రికను నభిమన్యునకిచ్చి యశంబునంది నాదుఃఖంబింపుక యార్పుము.

బల—చెల్లెలా! సుభద్రా! నీకీచింతయేల! రాజ్యమా కౌరవులపాలైయున్నది. వసియించుటకు గృహమూలేదు. తినుటకా కూడులేదు. పండుటకా మంచములేదు. మీపాండవు లిట్టులుండిరి. అభిమన్యున కేమిచూచి నాపుత్రిక నిమ్మనికోరుదువు?
[బలరాముడు సుభద్రను చిన్నబరుప సుభద్రపాడెడిపాట.]

హిం—తోడిరాగం—ఏకతాళం.

ప॥ హాసోదరా నీ సోదరినిటు పరిభవోక్తులనదగునా నీసమముగను । నేకగర్భంబున । నేజన్మించిన। దానగానా ॥ హాసోదరా॥
అ॥ ప॥ నీసుతునకు నేమిజూచి మాశశి । రేఖనిమ్మటంచు బల్కుచుంటివంటివే॥

నీసుత మనమున మన్మథుడైవిల । సిల్లుచుండెనా పిల్లవాడు వాసిగమీకు మేనల్లుడుదలపగ । భాగ్యమేల యింతకన్నా యన్నా ॥హాసోదరా॥

సుభ—అన్నయ్యా! నీవు సోదరుండవై యుండియు సమస్తధర్మాధర్మసంవేదివై యుండియు, నన్నీరీతిని బరాభవింపవచ్చునా. ఆపదలెప్పుడును నిల్చి కాపురముసేయునా! సమస్తమునుదైవాధీనముకదా. అన్యాయంబున గైకొన్న యాకౌరవ రాజ్యలక్ష్మి యంతరింపకనిలచునా. పాండవులు ధర్మపాశబద్ధులై యుండుటచే వారికట్టి యిక్కట్లు ప్రాప్తించె. ఇది నీకుమాత్రము తెలియదా. అన్నా! నీవనవలసి యనుచుంటివి. నావిన్నపమాలించి యథార్థవాదవిగమ్ము.

బల—ఆపదలు కాపురముసేయవనియు, ముందెప్పుడో పాండవులు సిరినందగలరనియు, కౌరవరాజ్యలక్ష్మి యంతరించుననియు దలంచి నాపుత్రిని నీపుత్రున కీయమందువా. చాలు చాలు నిన్నర్థునునకిచ్చి మేమనుభవించుచున్న సుఖమునుచాలదా.

[బలరాముడు సుభద్రమాటలు విననిష్టములేక పాడెడిపాట.]

కమాచి రాగం—ఏకతాళము.

ప॥ బలుమాటలు నా । మోలనుబలుకక । భవనమునకు యికవెడలు ॥

అ॥ ప॥ పలుకులికేలను । సుభద్రవినునా । భావమునంగల । రూఢిగ

యిదెదెల్పెదను ॥బలు॥

తలపుమా । కలనువార్తగా । తన్నీసుతున । కేనొసంగుట కలిమికి ।

బలిమికి । ఘనుడగు । లక్ష్మణునకు కేనిశ్చయము ముమ్మా

టికిన్ ॥బలు

సుభ—అయ్యో! సోదరా! నన్నింత చిన్నచూపునఁజూచుట నీకు

న్యాయమా! ఇన్నిదినంబులనుండియు మీయండనుండి, యిది

జరుగునని యించుక సంతోషముతో నుంటినే. అక్కటా! అ

ది యంతయు వ్యర్థముచేసెదవా! అగ్రజా! నావిన్నపమాలిం

చి శశిరేఖను కోడలుగాజేయవా!

బల—

మత్తకోకిల.

కూడుగుడ్డలు నిచ్చుచుండగ ♫ గూర్మినుండక పైపయిన్

గోడలంచు వచింపుచుంటివి ♫ కొల్లబోవునె భాగ్యముల్

చేడెయేడ గృహప్రవేశము ♫ సేయనెంతువె కోడలన్

జాలుజాలును బల్కకింకిట ♫ సాధమున్ వడిఁజేరుమా.

సుభ— అన్నయ్యా! ఇవి ములుకులుగాని పలుకులుగావు.

శా. ఆవేళన్ శశిరేఖనీసుతునకే ♫ యర్పింతునేనంచు, ని

చ్ఛావృత్తిన్ వచియించి నాకుఁగడునా ♫ శంగొల్పి; యద్దానినిన్

బోవందోయుచు శోకవారినిధిలో ♫ దోయందలంతేనన్

వేవేవృత్తము నెక్కునెక్కుమని నీ ♫ వేనిచ్చెదన్ దీయుదే.

బల—సుభద్రా! నీమాత్రమునీతులు నాకును దెలియు. అధికప్రసంగ మింకఁగట్టిపెట్టి నీదారిని నీవుపొమ్ము.

ధ్రువకోకిల.

పడతి! కోడలుకోడలంచును ఽ బల్కనేటికి నిట్టులన్
విడువుమీ యిక నట్టికోరిక ఽ వేవిధంబులఁజెప్పితిన్
కడుపుగూటికె లేనియప్పుడు ఽ గల్గునే మఱికోడలున్
వడిగబొమ్ము గృహంబుజేరఁగ ఽ భావమందున గుందకన్.

ఇంక పలుపలుకులేల. శశిరేఖను నభిమన్యునకీయను. లక్ష్మణునకేయిచ్చెదను. పంచమీదినంబున వివాహము నిశ్చయింపబడినది

సుభ—(తనలో) అయ్యో! ఎంతచెప్పినను నీతఁడు వినఁడయ్యె. ఏమి సేయుదును. (ప్రకాశముగా) సోదరా! చెల్లెలికి గంటనీరుదెచ్చుట శ్రేయస్కరముకాదు. ముద్దులమేనల్లుని విడిచి కన్యకను శత్రునకిచ్చెదవా! శశిరేఖాభిమన్యుల పరస్పరమోహానుబంధంబైన యొక్కింత విచారింపుము.

బల—నీవెన్ని చెప్పినను నేనుపిల్లనివ్వను. కౌరవులతో సమాను లీ జగంబునలేరు కూటికిలేక నడవుల దిరుగుచున్న పాండవులం దలంచినచోఁ బాపంబు సంభవించును. నీవు చింతించినంత మాత్రంబున నాకపజయము గలుగదు. పొమ్ము పొమ్ము.

సుభ—ఎంతకూటికిలేక నీపంచఁజేరినను సోదరిననియైనను భావింపక నిట్టిమాటలాడుచుంటివి. కౌరవరాజ్యలక్ష్మినిఁజూచి దానికాసపడి నిరంతర ధర్మవ్రతాచార పారీణులగు పాండవులనుదూఱుచుంటివా! పాండవుల కాలిగోరునకైనను కౌరవులు చాలుదురా. నీయింటికి కూటికి జేరియుండుటచేత నేగదా యింతయెల్లిదమై యన్నిమాటలు పడవలసివచ్చెను. ఇష్టమైనచో పిల్లని

చ్చెదవు. లేనిచోఁబోనిమ్ము. నాకుమారునకు వివాహాము శ
కయుండదు. కానిమ్ము. ఇన్నిమాటలు నీచేబడి యింకను
గృహంబున నుందునని తలంచితివా. ఈక్షణంబునందే కుమా
రుని దోడ్కొని పాండవులకడకే బోయెదను. నీయిచ్చవచ్చిన
యట్లు శశిరేఖను లక్ష్మణునకేయిచ్చి కట్టుము.

(నిష్క్రమించును.)

బల.—ఆఁడవాండ్రెంతకుఁజాలరు. (నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము





(శ్రీ)

# శశిరేఖాపరిణయము.

## ద్వితీయాంకము

[ఉద్యానవనము:— ప్రవేశము శశిరేఖ]

[శశిరేఖ ఉద్యానవనమున ప్రవేశించుచుపాడెడిపాట.]

కాఫిరాగం.—ఏకతాళం.

ప॥ అకటావిధీ। నీకిదిన్యాయమా। శ్రేయమా। నన్నిటులన్
జేయగన్॥

అ॥ ప॥ సకలమెరింగిన । జనకుడునామది । చక్కగనిను దుర్యోధ
నాత్మజుకున్ నన్నిడగన్ । నెంచెనహా॥ అకట॥

నఖుడభిమన్యుడని । స్వాంతమున నెంతో । సంతోషముననుండ। యి
టులయ్యెన్ అయ్యయ్యో యెటులింకన్ యేమనెదన్ ॥అకట॥

శశి—(తనలో) హా! తండ్రీ! నీవునిరంతరకరుణామయుండవు. ధర్మ
ప్రతాచార పారీణుడవు. సుగుణమూర్తివి. అట్టినీవే ధర్మము
తప్పి ప్రవర్తింప నెంచితివా! చిన్ననాటనుండియు నభిమన్యు
డు నాకుబతియగునని యెంతయో ముచ్చటపడుచుంటినికదా.
సౌభద్రాధీనంబైయున్న నాచిత్తంబన్యుల నెట్లువరించును. అ
య్యో! సంపదలకాశించి నన్నుం గురుకులపాంసనుండగు ల
క్ష్మణునకీయ నెంచితివా. జనకా! ఇట్టి కట్టడికార్యము సే

యుటకన్న నీముసలంబుచే నాతలద్రెళ్ళనేయుట మంచిదికదా అక్కటా ! నాయందెంత నిష్కరుణ వహించితివి.

ఉ. మారసమానసుందరుఁడు ॥ మాన్యహితుండు సమస్తసద్గుణో
దారుఁడు ఫల్గుణాత్మజుఁడు ॥ ధర్మపథైకవిహారకీర్తివి
స్తారుఁడు విక్రముండు జన ॥ సంస్తుతుఁడా యభిమన్యుబాసి యీ
ధారుణియందు జీవములు ॥ దాల్పఁగశక్యమె దేహమందునన్.

తండ్రీ ! బలరామా ! లక్ష్మణునకీయవలదని యత్తయగు సుభద్రయుఁ బినతండ్రియగు శౌరియు నెంతబ్రతిమాలినను వినవైతివికదా. హా ! నీది యెంతకఠినహృదయము. విధాత యయ్యది పాషాణంబుతో నిర్మించియుండెఁగాబోలు. (అభిమన్యునుద్దేశించి)

సీ. అభిమన్యుఁడే నాకు ॥ నాత్మేశుఁడంచును
మోదమ్ముతోడ నుప్పొంగుచుంటి
నినుఁబాసికుణమైన ॥ నిలువకనీతోడ
ననిశంబు మెలఁగుచు ॥ నలరుచుంటి
గల్పైన నినుఁబాయ ॥ క; ధరణియందున
జెలఁగుబాస నటంచుఁ ॥ దలఁచియుంటి
నీవైవంబుచు ॥ భానమందున నెంచి
పరమహర్షంబుతో ॥ వరలుచుంటి.
తే. గీ. నక్కటా ! యాసలెల్లని ॥ రాసజేసి
కౌరవేశ్వరసుతుఁడు ల ॥ క్ష్మణునకీయ
నన్ను ; దలపోసియుండెను ॥ నాదుతండ్రి
రాన ! బ్రోవవే ! వే సుభ ॥ ద్రాకుమార.

హా ! నన్నెటని జేరుదు ! నాకడ్డుపడువారెవ్వరు ! హా ! మనోహరా ! అభిమన్యూ ! నిన్నువిడనాడి, యీలక్ష్మణునిగట్టుకొని బ్రతుకవలె !

నదేనా. అయ్యో! నాకర్మము కాలిపోవ. ఆకురుకులపాంస నుండా నాకు భర్తయగుట! ఆసుభద్రాసుతుఁడిపైఁ జిక్కియున్న నాచిత్తంబారులపై కేగునా! (విచారించుచుగూర్చుండును)

[అంతభారతియను చెలికత్తె ప్రవేశించుచున్నది.]

భార——(తనలో) శశిరేఖ యెన్నఁడును నాతోఁ జెప్పకుండ వనవిహారంబునకు నొంటరిగ వచ్చియెఱుంగదే. నేఁడేమి కారణమో గాని నాతో చెప్పకుండనే వచ్చినది. ఈవనంబునం దేమూల నున్నదో. (నలుదిక్కులు పరికించి) అదిగో! ఆమాలతీలతాకుంజంబు చాటున గూర్చున్నది. ఈమెముఖంబు మిగుల విచారభావంబును సూచింపుచున్నది. ఇందులకేమి కారణమై యుండునో కదా (ఆలోచించి) ఏమి కారణమున్నది. అభిమన్యుని పైగలప్రేమానుబంధంబు పీడలేకపోవుటయే కారణము. అన్నా! ఆబలరాముఁడెంతకార్యము సేయనెంచెను. సంపదకాశించి చిన్నతనంబునుండియు దనయింటఁ బెఱిఁగిన యభిమన్యునివీడి దుర్యోధన సుతుండగు లక్ష్మణునకీయ నెంచెను. శశిరేఖాభిమన్యుల పరస్పర మోహానురాగంబైనను వీక్షించలేదే. (ఆలోచించి) దైవసంఘటనమున్నచో నిప్పుడు మాత్రమేమి మించినదేమున్నది. శశిరేఖం జేరి పలుకరించెదఁగాక. (శశిరేఖను సమీపించి) చెలీ! శశిరేఖా! ఎన్నఁడును నాతోఁ జెప్పకుండ వనంబున కొంటరిగ వచ్చినదానవుకావు. నేఁడేకారణముచేతనోగాని యిట్లువచ్చితివి.

శశి——సఖీ! కారణమేమున్నది? ఇంటికడ నేమియు దోచక యుండుటం జేసి యిట్లువచ్చితి.

భార——అదియా కారణము. అంతియేగాని యభిమన్యుఁడీ వనంబున కరుదెంచెనేమోయని తలంచి యుతనిం జూడరాలేదుకదా.

శశి—చెలీ ! ఆనామము నాకు జ్ఞప్తికిఁదెచ్చి మరింత సంతాపము కలుగఁజేసెదవేల ?

భార—అట్లంటివేమి ? ఆతనిపేరు విన్న నీకుసంతోషమేకదా.

శశి—(నిట్టూర్పుపుచ్చుచున్నది.)

భార—సఖీ ! శశిరేఖా! అనేక వృక్షసముదాయ సంయుతంబై భాసురకాసారయుతంబై యొప్పు నీవనంబున నెక్కింతకాలము విశ్రమింతము రమ్ము.

[వనవిహారమునలుప చెలులు బిలువ శశిరేఖపాడెడిపాట.]

బేహాగ్ రాగం—రూపకతాళం.

ప॥ చెలులారనన్నేల శ్రమబెట్టనెంతురు । చిత్తమదేలనో తత్తరిల్లుచుండెఁ॥

అ॥ ప॥ మలయమారుతమును । నలుదెసల్ వెదజల్లు । మంచితరుణమయ్యె । మదిపోదదేలనో॥ చెలులా॥

కలతజెందెనేఁడు । కలికిరోభారతి । గాననన్నునీవు బాధింపవలదమ్మా చెలులా॥

శశి—భారతీ ! నన్ను శ్రమబెట్టకుము. నామనం బేలకోగాని నేఁడీ వనవిహారంబుపై పాఱకున్నది.

భార—నీమాటలకేమి యిటురమ్ము. (చేయిఁబట్టుకొని)

త్రిభంగివృత్తము.

కలికిరో శుకముల ॥ కలవరముల పిక ॥ ముల మృదు భాషణగంబే ముదమంబే వేడ్కతోవింబే

చెలియరో కనుఁగొను ॥ సలలిత గతినదె ॥ సకలతరుల్ చిగురించెఁ దమిబెంచెఁ గోరికనించెఁ

పొలతుక పలువిధ ॥ ఫల సముదయములు॥మదికినిమోదముగూర్చుఁ జెలిచూడఁ యాకలిదీరఁ

శశి—అబ్బా! నన్నెందుల కాయాసపెట్టెదవు? నేను రాజాలను.

భార—నీవెప్పుడును నట్లేయందువు.

మత్తకోకిల.

కొమ్మరో కనుఁగొమ్మదే ఘన । కోకిలారవముం గనన్
రమ్మ్యవేగము పోదమల్లు కు । రంగనేత్రి ముదంబునన్

శశి—కొమ్మరో వినఁజాలనే ఘన । కోకిలారవమిప్పుడున్
సమ్ముదంబును బాపినామది । ఝల్లుఝల్లన జేయదే.

భార—కోకిలారవంబు విన్నంతమాత్రంబుననే హృదయము ఝల్లు మనునా! అవునవును. అభిమన్యాయత్తమైన నీచిత్తంబున క ట్లేయుండును.

శశి—చెలీ! నీవేళాకోళంబులకేమి. అబ్బా! నేడేమియోగాని, నామ నంబంతయుఁ గలతజెందియున్నది.

భార—నీహృత్పికంబును దొంగిలించిన యభిమన్యుని జూడకపోవుట యే యందుకుఁగారణము.

శశి—ఉష్. అబ్బా! ఎంతచెప్పినను నామాటమానవుకదా.

భార—నీకు మనసోత్సాహంబుఁ గలిగించుటకే యట్లనుచుంటికదా.

శశి—అయ్యో! నాచిత్తంబునకుత్సాహంబుగూడనా.

భార—సఖి! అట్లు పలికెదవేమి?

శశి—

మ. సరసీజాక్షిరో యేమిచెప్పుదుమహా । సౌభాగ్యముం జూచి, ని
ష్కరుణంబూనుచునాదుతండ్రి యకటా । సౌభద్రునిన్ వీడి, యు
క్కురునాథాత్మజు గట్టగాఁదలఁచె నా । కున్ వ్రాత యిట్లొప్పనే
తరుణీమున్నిటి నేమనంగలను సం । తాపాబ్ధింగొనిప్పుడున్.

భార—అయ్యో! చెలీ! విచారింపకుము.

[అభిమన్యుఁడు — ప్రవేశించుచున్నాఁడు.]

[అభిమన్యుడు ఉద్యానవనము ప్రవేశించి పాడెడిపాట.]

కేదారగౌళ రాగం — ఏకతాళం.

ప॥ కారణమేమో । నా ప్రియసఖి । శశిరేఖ । గృహమునందైనన్ । గన రాదయ్యెన్ । యెందెందున్ । గనరాదయ్యెన్ । యెందే గని దైవమా॥ కారణ॥

అ॥ ప॥ ఆరమణీమణిన్ గనులారన్ గనినంతవరకున్ । అయ్యో నా వదినిల్వదు ఆరసిచూచెద యీసుతువని యంతైన గ్గనపడకున్ను నెనసవిహారము సల్పుటసతిహితముగదా॥ కారణ॥

అభి—(తనలో) నేడేమికారణమో కాని శశిరేఖాకాంత గృహంబున గానిపించలేదు. అందుచే నాహృదయంబించుక కలంతజెందియుండె. యామెను సత్వరంబుగఁ జూడదలంచి, యుద్యానంబునకేతెంచితికదా! ఆమెయు దనచెలి మికత్తెతో నుద్యానంబున నుండుననియే నానమ్మకము. (నలుదిక్కులం బరీక్షించి) అదిగో! మన్మనోహారియగుశశిరేఖ.

తే॥ గీ॥ చేరి భాషింపుచున్నది ౹ చెలియతోడ
చారుశారదపూర్ణిమా ౹ చంద్రవదన

(పరికించి) కాని,

వాడియుండె నెలతమోము ౹ వేడియుండ
యందు వైచినలేతామ ౹ రాకుపగిది॥

నేడేమియో గాని యీమె దీనవదనయైనట్లు గానుపించుచున్నది. కారణమేమియో తెలియరాదు. చెలికత్తెతో నేమియో సంభాషించుచున్నది. వీరికిఁగనఁబడకుండ నాసంభాషణ నాలించె

శశి—చెలీ! భారతీ!

మ॥ సరసాలోకన హాసభాసుర విలా ౯ సస్ఫూర్తిఁ దీపించు సుం
దరమోహమును గల్గినామదికి మో ౯ దం బెప్పు డుంగూర్చునా
వరసౌభద్రుని బాసియుండినయెడ ౯ బ్రాణంబులున్నిల్చునే
తరుణీ! యేమియొనర్చుదానఁ జెపుమీ ౯ దాక్షిణ్యభావంబునన్.

అభి—(తనలో) ఆహా! శశిరేఖకు నాయందుగల ప్రేమానురాగంబులు వర్ణనాతీతంబు కదా. ఈచెలితో నన్ను గూర్చియే భాషించుచున్నది. ఈసఖి యేకారణంబుచేతనోగాని "సౌభద్రుని బాయఁగల్గినయెడల ప్రాణంబులెట్లు నిలచు"నని వాక్రుచ్చుచున్నది. ఆహా! ఇట్లు వచించుటకుఁ గారణమేమైయుండునో కదా. ఇంతమాత్రంబున కేమి కారణముండును. నాయందుగల యనురాగంబుచే నిట్లనియుండును. (ఇంచుకయూరకుండి శశిరేఖనుద్దేశించి) ఓబలరామతనూజా! శశిరేఖా!

ఉ. వారధులింకనిమ్ము బడ ౯ బానలమాఱఁగనిమ్ము తారలున్
ధారుణిఁ వ్రాలనిమ్ము హిమ ౯ భాను, ప్రభాకరు లిర్వురున్ గతుల్
మారఁగనిమ్ము; నమ్ము మను ౯ మానసులేకను చెప్పుచుంటి నో
సారసనేత్రి నిన్నువిడఁ ౯ జాలను ప్రాణములుండు నంతకున్.

భార—రమణీమణీ! శశిరేఖా! నీమనంబున నాయభిమన్యు నేస్మరింపుచు నీరీతినీచిత్తంబునకు సంతాపంబు గొల్పుట పాడిగాదు.

శశి—అయ్యో! భారతీ!

తే॥ గీ॥ నామనంబున నొప్పెడి ౯ నవ్యధనము
దొంగిలించిన యాగజ ౯ దొంగయతఁడు
మాన్యగుణతేజుఁడౌ యభి ౯ మన్యునెట్లు
స్మరణసేయకుండుదును మాన ౯ సంబునందు.

తరంగిణి॥ స్మరుఁ హసించురూపు ♦ జాలకల్గువానిని
సరోజపత్రనేత్రు ♦ సద్గుణప్రపూర్ణుని
గిరీటిపుత్రుచారు ♦ కీర్తిశాలిధీరుని
స్మరింపకుండ మాన ♦ సంబునిల్పునేసఖీ.

ఆయనంగ సుందరాంగుని రూపంబెప్పుడుచూచినను నాకను లకు గట్టినట్లే యుండునుకదా.

భార—రమణీ!ఆయభిమన్యునిపై మోహమువీడవుకదా!

శశి—అయ్యో! చెలీ! ఆదివ్యమంగళవిగ్రహునిపై మోహంబెట్లువిడ వాడ గలుగుదును? ఆతండే నాపతియని నింతుకోరికతో ము దమందుచుంటినే. అక్కటా! ఇంతలో నిట్లయ్యెనా! ఆహా. ఏమిచేయుదును.

అభి— (తనలో) ఏమిది! చెలివాక్యంబులు నేడు మఱియొక తీరుగను న్నవే. బలరాముం డిక్కన్నియను నాకుగాక యొరులకిచ్చెదన నిచెప్పెనా యేమి! నామనంబున నేమియుఁదోచకున్నది, (ఇం చుకయూరకుండి) ఏమికారణముచేతనో కాని నాయెడమ కన్ను దరుచున్నది.

శశి—అబ్బా! చెలీ! ఈమందమారుతము నాకు వేడిమొండవలెఁదోచు చున్నది. చిలుకపలుకులు నాచెవులకు ములుకులగుచున్నవి కదా! అయ్యో! ఈతాపం బెట్లుభరింతును.

భార—దీని కంతకును నీమనోహరుండగు నభిమన్యుఁడేకదా కార ణము.

శశి—హా! యభిమన్యూ! సుభద్రాకుమారా! నిన్నొకనిమిషం బెడ బాసినచో నొక యుగంబుగ నుండునుకదా. ఒకసారి నీముఖ కమల సందర్శనమాచరింపనిమ్ము. హా! ప్రాణేశ్వరా!అన్నా! ఇంకెక్కడప్రాణేశ్వరుఁడు.

సీ. నాతల్లిముదమూర । గాతండ్రితో జెప్ప
దాయెగా దాయగా । దలఁచెఁగాని
జనకుండుకూతురం । చును నెంచడాయగా
నంచితంబగు సిరి । కాసజెంది
పినతండ్రి కృష్ణుండు । వేడగా వినడాయె
గా తండ్రియింతైనఁ । గరుణఁబూని
చెల్లెలంచునునైన । చిత్తంబునసుభద్ర
మన్నింప డాయెగా । మహితప్రేమ
తే. గీ. అక్కటా సుభద్రాత్మజా! । యవనియందు
నిన్నె వాంఛించియుండిన । నేను; కౌర
వేంద్రనందను నెటువరి । యించుదాన
నెంత నిర్భాగ్యురాలనో । యెంచిచూడ.

అభి—(తనలో) ఇప్పటికి నిజము తెలిసినది. బలరాముం డిక్కన్నియను దుర్యోధనసుతుండగు లక్ష్మణున కీయ నెంచెను కాఁబోలు. (బలరాముని యుద్దేశించి) హా! బలరామా!

తే. గీ. ఆడితప్పనివాడవ । టంచునిన్ను
జనములెన్నుకొనుచు నుందు । స్వాంతములను
కట్ట; మున్నిచ్చినట్టివా । గ్దానమంత
మఱచియీరీతి జేయుదే । మహితలమున.

శశి.—హా! యభిమన్యూ! ఒక్కసారి నీసుందరవదనారవిందంబుఁ జూపుము. (అని మూర్ఛిల్లును)

అభి—ఈమెనాకై గడుపరితపించుచున్నది. కావున నొకసారి యీమెతో భాషించెదఁగాక. (తొందరగా శశిరేఖను సమీపించి) చెలీ! శశిరేఖా! ఇదేవచ్చితిని. నన్నువీక్షింపుము. (భారతిం జూచి) భారతీ! శశిరేఖ యింతపరితాపమందుటకుఁ గారణం

లేమి. ఈమెయింతకుమున్నే "సుయోధనసుతుని వరించుదాన నా" యని యొకవిరుద్ధపు వాక్యంబుబలికినది. అందలి నిజం బేమి. ఆవాక్యము వినినప్పటినుండియు నామనంబు డోలాయమానమైయున్నది. సత్వరమ్ముగఁ జెప్పుము.

భార—అయ్యా! చెప్పుటకేమున్నది. సుయోధనునిచే బంపబడిన భూసురుండు మీమామయగు బలరామునికడకు వచ్చి, శశిరేఖను లక్ష్మణునకిమ్మని యడుగగా, నతండందులకు సమ్మతించి శుభముహూర్తముగూడ నిశ్చయింపజేసెను. వివాహమింకమూఁడుదినంబులున్నది. మీ యమ్మగారెంత వేడుకొన్నను, మీ చినమామయగు కృష్ణుండెంత చెప్పినను బలభద్రుండు వినినవాఁడుకాఁడు. ఇదియే శశిరేఖకు సంతాపకారణము.

అభి—హా! ఎంతలో నెంతపుట్టెను!

మ. జననంబాదిగ నెన్నదుఁ ధరణిపై సఖ్యంబునన్ పీడకన్
వనితారత్నము నామభార్యయనుచున్ వాంఛించియున్నాఁడ; హా
ఘనకారుణ్యము లేకసీరియిటులన్ గావింపఁగా నెంచెఁగా
వనజాతాసను వ్రాతకేమనుదు నిర్భాగ్యుండ; నోసుందరీ.

అయ్యో! నాయాశావృక్షంబు నేఁడో రేపటనో ఫలించునని ముదంబందుచుంటినిగాని యిట్లగునని యెన్నఁడును కలనైనం దలంపనైతినే. హా! రమణీశిరోమణీ! బాల్యంబాదిగ నొక్కకంచంబునందే గుడుచుచు, నొకశయ్య యందేపండుచు, నెన్నఁడును నెడబాయక నుండినమనప్రేమను నేనెట్లుమఱువఁగలను. హా! శశిరేఖా! నాయాశలన్నియు నిరాశలయ్యెనుకదా!

శశి—(మూర్ఛనుండి లేచి)

[ఉద్యానవనంబున శశిరేఖాభిమన్యులు గలిసికొని
పాడెడిడైలాగ్పాట.]

ముఖారిరాగం——ఆదితాళం.

శశి——ప॥ మారసుందరాంగ నిన్ను మరచిపోమ్ము నెమ్మదిన్ యో
ర్వలేక । విరించిమన । మైత్రిలతనుద్రెంచెప ॥మార॥

అభి——ఓరమణీయమణిమణీ । ఓసర్వసుగుణఖనీ ధారుణియందు సర్వ
మునీవె । దలప । నిన్నెట్లు । మరతు ॥మా॥

శశి——క్రూరులు మరివైరులు మనకెంచిచూడగా కురుకులజులుహా
వారికిన్ బెండ్లిసేయునంట.

అభి——యేరీతిసల్పునో జూచెదకంట.

శశిరేఖాభిమన్యులు——ఓరమేశాసుప్రకాశ దోషవినాశ శ్రీనివాసా
శే, ష, శా, యీ, భాగమునీదేమమ్ములన్
జత । బరపిక్రృపను। బ్రోవగా॥

సీ. ఎచటికైననుబోవ । నెపుడువచ్చునోయని
యెవ్వారికైయెప్పు । డెదురుజూతు
ఎవ్వానిరూపంబు । వీక్షింపకుండిన
ఘడియయొకయుగంబు । గాగదోచు
ఎవ్వానిముఖబింబ । మిందుబింబోపమా
నంబంచునెంతు మ । నంబునందు
ఎవ్వాడుభర్తయై । యెగడునంచునుమది
ఘనమైనయాశతో । గ్రాలుచుంటి

తే. గీ. అట్టినిన్ను సక్కటకటా । యాత్మయందు
మఱువశక్యంబె నాకును । మహితచరిత
ఎంతపాపిష్టినోకదా । యెంచిచూడ
దైవవిధికేమనుదు సుభ । ద్రాకుమార

భార — రమణీ శశిరేఖా !

తే. గీ. దైవయోగంబు నెవ్వారు ॥ దాటగలరు
చింతఁబొందంగఁబోకుమీ ॥ స్వాంతమందు
దైవఘటనమేయున్నచో ॥ దప్పకుండ
నితఁడె నీకును బతియగుచు ॥ నెగడరాదె.

అభి —

సీ. నాప్రాణపదమైన ॥ నారీమణివి నిన్ను
విడనాడశక్యమే ॥ వెలది మిన్న
నవ్వులాటలకునైన ॥ నెవ్వనాడెఱుగని
నిన్నెట్లు బాయుదు ॥ నీరజాక్షి
నాకు సతియటంచు ॥ బ్రకటంబుగ నెంచు
నిన్నెట్లు వీడుదు ॥ నీరజాక్షి
బలునవ్వులకు వెన్నె ॥ లలుగాయు నిన్నెట్లు
మఱువగా జెల్లును ॥ మహితచరిత

తే. గీ. అక్కటా ! యాశ లెల్లను ॥ నవని గలసె
యంతరించెను నానిందు ॥ సంతసంబు
యింతిరో మదియందునఁ ॥ జింత యేల
ధాతవ్రాతను నెవ్వారు ॥ దాటఁగలరు,

శశి — హా ! మనోహరా ! నిన్నుఁబాసి నేనెట్లుండగలను ! చిన్ననాటనుండియు, నీపైఁ జిక్కియున్న నామనంబిప్డు ఘోరునివరించునా ! అక్కటా ! నాతండ్రి నాయెడల నెంతనిర్దయవహించెను.

మత్తకోకిలవృత్తము.

అభి — కాంతయోయిటు జింతనొందిన ॥ గానుపించునె లాభమున్
స్వాంతమందున ధైర్యమూనుము ॥ చానరోననుమర్వుమీ

శశి—— కాంతుఁడా నినుబాసి నేనెటు గావ గల్గుదుజీవముల్
స్వాంతమందున ధైర్యమెట్టులు జాలెదన్ వగమానగన్.
అభి—— కాంతుడంచును బిల్వబోకుము కామినీ యిక నన్నునున్
గాంతుఁడా దలపోసిచూడగ కాక వేశ్యకు పుత్రుఁడున్
శశి—— ఇంతమాటను బల్కు నీమది యెట్లు సమ్మతి నొందెనో
వింతదోచెను; వైరి యాతఁడు వెల్గనే పతి యౌచునున్॥
అభి—— తరళవృత్తము:——
గళమునందున తాలిబొట్టును గట్టునాతఁడె భర్తగా
శశి—— పలుక నేటికి నీవిధంబున పాపులక్ష్మణుగోరుదే
అభి—— లలనరోయిటు చింతనొంద దగ లంపగా మది జెల్లునే
శశి—— పలువిధంబుల నిన్ను నెంచుచుఁ బ్రాణముల్ త్యజియించెదన్
అభి—— కలికి సాహసమేల యిట్టులు గావ దేహాది యిప్పుడున్
పలువిధంబులు జూడగా మన వాంఛలే సమకూరెడిన్
జెలగ దేవర ధర్మచిత్తుఁలు శ్రీశు సత్కృప నందుచున్
విడచి చింతను ధైర్యమూనుచు వేగ్మృహంబున కేగుమీ॥
శశి—— హా! మనోహరా! నిన్నెడబాసి యెట్లుందును!
అభి—— రమణీ! చింతింపకుము. దైవమనుకూలుఁడయ్యె నేని మా కోరికలు ఫలించితీరును. హా! శశిరేఖా! నీతండ్రి నిన్ను నాకొసంగి పరిణయము సేయఁ నెనుగా! ఆహా! అందులకు గతిలేమోకదా!
శశి—— కూడుగుడ్డలులేక మనపంచకు జేరినయాతనికెట్లు పిల్లనిత్తునపలికెనఁట.
అభి—— ఛీ! అతఁడారీతిఁ బల్కెనను నింకను మాయమ్మపేరియుంటడెనుగా. ఇంక నిచ్చట నుండరాదు, మాయమ్మను దోడ్కొచ్చుటకైన నేగెద.

కవిరాజరంజని

మనోహారీ ! మనోహారీ ! ॥ మనోహారియిదే
చనంగనుంటి నిన్నుశీఘ్ర ॥ శ్వరుండె బ్రోచుతర్
మనంబునన్ ఘనంబుగన్ ॥ బడంతిరోయికన్
ననున్ గుఱించి తాపమున్ ॥ వగన్ విడందగున్.

సుగంధి.

బాలనీవు శీఘ్రమేను ॥ భక్తిమీఱగొల్చుచున్
గాలమెల్ల వెళ్ళదీయఁ ॥ గాదగున్ గదాభువిన్
జాలినొందబాడిగాదు ॥ సంతసంబు మీఱఁగా
నేలుగాక నిర్వురన్ ర ॥ మేశుడెంత యోకృపన్.

(నిష్క్రమించుచున్నాఁడు)

శశి—చెలీ ! భారతీ ! అభిమన్యుకింకఁ దల్లినిదోడ్కొని వచ్చుటకై నను బోవుమకాబోలు. అయ్యో ! నాకేమియుం దోచకున్నది. ఏమి తెలుపు?

భార—సఖి ! చింతింపక గృహంబునకుబోయి యేమిజరుగునో చూతము రమ్ము మనమువచ్చి కడుతడవైనది.

(ఇరువ్రురును నిష్క్రమించుచున్నారు.)

రంగము.

[మందిరములో సుభద్ర ప్రవేశించుచున్నది]

[బలరామునికఠిన స్వభావమునుదలచి సుభద్రపాడెడిపాట.]

హిం—తోడిరాగం—ఏకతాళం.

ప॥ కటకటా । యెంతకఠినుడయ్యె బలరాముడు । కనికరమింతైన లేక కలతజేర్చె నామదికీ ॥కటకటా॥

అ॥ ప॥ పటుతరగు । మైత్రిలతను ద్రెంచి పాడుధనము గాస । పడి
చేడియశశిరేఖన్ । పరులకిచ్చుచుండెగా ॥ప॥
కటితవాగ్దానము నాకొసగి యనృతమాడెగా ॥కటకటా॥

సుభ—(విచారముతో) ఆహా! నేనెంత వేడికొన్నను మానోదరుండగు బలరాముడు నాప్రార్థన కంగీకరింప లేదుకదా! ఇయ్యది విన్నచో నభిమన్యుం డెంతగా జింతించునో? అగ్రజుండన్న దుర్భాషణంబులను కుమారుండాలించినచో నెంతయాగ్రహము చెందునో? అయ్యో! ఏమిచేయుటకును దోచకున్నది.

[అభిమన్యుడు ప్రవేశించుచున్నాడు.]

అభి—(స్వగతము) బలరాముండిట్లు సేయనెంచెనట శశిరేఖచే విన్నదాదిగ నామనంబంతయు డోలాయమానంబై యున్నది. ఇంకనేను మాయమ్మతో భాషించి ముందుకర్తవ్యంబునకుం గడంగవలయును. (ఎదుటనున్న తల్లిం జూచి) ఇదిగో నాతల్లియిచ్చటనే యున్నది. (పరికించి)

మ. జననీ వక్త్రము నేడ దేమికతమో । సంతోషమేలేక, నా
ఘనగర్భాంతర చంద్రబింబముగతిన్ । గన్పట్టె; గన్నీరులున్
జనుచుండెన్ గద కాల్వలై బలుగగా । స్వాంతంబునందిట్టులన్
జనునే చింతిల; గారణంబరయుచున్ । ధైర్యంబునుం జెప్పెదన్.

ఈమెచింతకుం గారణం బరయవలసినదే మున్నది? శశిరేఖతన కుంగోడలు కాలేదనియేకదా చింత. (తల్లిం జేరి ప్రకాశముగా) తల్లీ నమస్కారములు.

సుభ—నాయనా! కుమారా! వచ్చితివా! అయ్యో! మనయాసలయు నిరాసలయ్యెనుకదా.

అభి—అమ్మా! నీచింతకు గారణంబు నేనరసితిని. ఇంతమాత్రంబున కీవు చింతింప నేల!

తే. గీ॥ హాలధరుని పుత్రియే నాకు ♦ నతివయంను
వ్రాసెనా నాముఖంబున ♦ బద్మభవుడు
దాసిమించిన కాంతలు ♦ ధరణి లేరె
కోడలేరాక యుండునా ♦ కొడుకుకింక.

సుభ—నాయనా! శశిరేఖ నాకుఁగోడలు కాలేదని నేనుచింతించుట లేదు. ఆబలరాముండాడిన దుర్భాషణంబులు నాకు హృదయశల్యంబులై నగుటం జేసి యిట్టిచింతనొందుచుంటి.

అభి—ఏమీ! బలరాముండాడినఁ దుర్భాషణంబులకా నీవిట్లు ఖేదపడుచుంటివి. ఆతం డేమనెను?

సుభ—పిల్లనీయకుండిన నుండుగాక! ఆతనిపుత్రికావివాహవిషయమై యెవ్వరభ్యంతరము పెట్టెదరు! కానికూడుగుడ్డలు లేక, తనకొంపకుఁ జేరియుంటిమని పలుకుచు, నన్నును, నీతండ్రిలను నానేక దుర్భాషణ బులాడినాడు.

అభి—(కోపముతో) కన్నియ నీయకపోయిన బోవుగాక.

తే. గీ. ధర్మమార్గమ్మునుసరించి ♦ ధరణిపైన
వరలునాదగు తండ్రులఁ ♦ బాండవులను
దూరనేటికి నాతఁడు ♦ దుష్టుడగుచు
నింక సైరింతు నేవాని ♦ బింక మూర్తు.

తే. గీ. గొడ్డవేయుల దూషించు ♦ పాపరతుని
బలుసు బలియిచ్చువాడనీ ♦ యిలకునిపుడె
వేగనాజ్ఞనొసంగి దీ ♦ వించిపంపు
సందియంబునుబొందక ♦ డెందమందు.

ఔరా! తొలుదొల్త తనకన్నియను నాకిచ్చెదనని వాగ్దానంబొసంగి, సంపదగలిగియుండెను కదాయని తలంచి, సుయోధనాత్మజుండగు లక్ష్మణునకీయ నెంచెను. (బలరాముని నుద్దేశించి) ఓరీ బలరామా! నీకు రెండు నాలుక లున్నవి కదరా! (సుభద్రను చూచి) అమ్మా! పలుమాటలేల!

చం. పురహరు గెల్చి పాశుపత ప్రభూతశరంబును బొందినట్టి యా
నరుని సుతుండనై యిటు ఘనంబుగ దిట్టిన; రేవతీధవు
గరము క్షమింపజాలుదునె? గావగజాలను నీకు నాకు స
త్వరముగ నానతీయుము ముదంబున వానిని ద్రుంచెదన్ వెసన్.

సుభ — నాయనా! శాంతింపుము. నీవంతటి పరాక్రమవంతుడవె యగుదువుగాని, నీకట్టి చేత యిప్పుడు తగదు.

అభి — అమ్మా! నీమాట నాకచ్చెరువు బుట్టించుచున్నది. ఏమీ! నేను కయ్యము చేయదగనా?

సుభ — నాయనా! నేనన్నది యందులకుగాదు,

అభి — కాకున్నచో సందియంబేల? తనకుమారునకుం బెండ్లిసేయకోన నెంచిన, యాకౌరవేంద్రుని బలరాముని, యాదవకౌరవ బలసమేతంబుగా దునుమాడి శశిరేఖాకన్యను బలిమిందోడ్కొని వచ్చెద. అనుజ్ఞనిమ్ము.

సుభ — నాయనా! కోపింపకుము. సుభద్రయే తనకుమారునిచే ట్టి కార్యము చేయించెనని లోకనిందకుం బాలుగానలసివచ్చు:

అభి — నీవెప్పుడును నిట్లే చెప్పుచుందువు ఇన్ని దుర్భాషణంబులు కిన, యీబలరాముని యింటనే యింకను నుండ నెంచితివా!

మ్ము నీవిచ్చవచ్చిన యట్లుండుము. నేనుమాత్ర మిచ్చట నుండను. నాతండ్రిలా జేరెదగాక.

సుభ — ఇచ్చటనుండుట నాకుమాత్ర మిష్టమనుకొంటివా! నీవేగుచుండఁగా నిచ్చట నేనుందునా. నేనును నీవెంటనే వచ్చెద. నన్నుఁగూడ గొని నీతండ్రిలకడకరుగుము.

ఆభి — అట్లయినచో మ మిక్షణంబునందే వీగృహంబునువిడిచి పోవలయును. రమ్ము.

(ఇరువురును నిష్క్రమించుచున్నారు)

ఇది ద్వితీయాంకము.





శ్రీ

# శశిరేఖాపరిణయము.

## తృతీయాంకము.

[అరణ్యము.—సుభద్రయు, నభిమన్యుఁడును ప్రవేశము.]

సుభ—నాయనా! ఎట్టిఘోరారణ్యంబునకు వచ్చితిమిరా! భానుఁడు జొరలేనితావనంగా నిదియేకదా!

అభి—తే. గీ. మనకు నపకారమునుసేయ ముదితలంచి
నట్టిబలరాము గృహమందు నలుకకంటె
నిట్టికాననమున వసి యింపుమండ
మంచిదౌచును మనకును బరగుగాదె.

సుభ—కుమారా! నీవుచెప్పినమాట నిశ్చయమే. అబ్బా! [illegible]నంబున కింకెంతదూరంబు నడువవలెనోకదా. ఎంతనడచినను తెలియకున్నది. భీకరక్రూర మృగారవంబుల కొండలు కంపమెత్తుచున్నది.

[అరణ్యంబునంగల ఘోరమృగములకు సుభద్ర యుపశమ
కుమారుండగు అభిమన్యుఁడు చెప్పినపాట.]

కమాంచిరాగం—ఏకతాళం.

ప॥ జననీవినుముసుమ్మా। జగతీ। శ్వరుడే। మనకిక। దిక్కు॥ జననీ॥

అ॥ ప॥ వనమునజరించు క్రూరమృగంబుల। కై ఘోరాంతము భీతి
జెందకే॥

మనమునకడు ధైర్యమూనుచుఁ । నుండదగును భీతిజెందకఁ ।
మనమునకడు ధైర్యమూనుచుఁ॥ జననీ॥
గనుమిదే । యాశరంబుఁ । గలుగమనకికఁ । భయమదేల నే।
తునుకలుగాగను । దునిమెద నెట్టికౄర మృగంబుల నైననుక్షణ
ము న॥ జన॥

అభి—అమ్మా! కౄరమృగంబులకు నీవావంతయు భీతినందవలదు
ఇదిగో! బాణమునాయొద్దనున్నది. నీవుమాత్రము నెమ్మది
నడువుము.

సుభ—అబ్బా! ఇదియంతయు ముండ్లమార్గముకదా. నడచుట కెం
తయో కష్టముగనున్నది.

అభి—అమ్మా! నిన్నుఁజూచిన నాకెంతయుఁ జాలియగుచున్నది.

తే. గీ. చెమ్మటలుగ్రమ్మె నీశరీ రమ్మునందు
వాడియుండె జందురునిమించి వరలుమోము
యెఱ్ఱవారెను చరణంబు లెంతయేని
కటకటా! చూచి యోర్వంగ గలనెచెపుమ.

జననీ! నీకు నిదురవచ్చుచున్నట్లున్నది. కావున యీవృక్షముక్రింద
నొక్కింతకాలము శయనింపుము. నీకేమియు భయంబులేదు.

సుభ—(వృక్షముక్రింద శయనించును.)

అభి—(తనలో) ఆహా! ఆయవినీతుండగు బలరాముని కారణంబున
మాకెట్టిగతి సంభవించినది. ఓరీ! బలరామా! చిన్నవాట
నుండియు శశిరేఖను నాకొసంగి పరిణయము చేయుదునని ప
లికి, యిప్పుడకన్నియను లక్ష్మణునకిచ్చుచు మాకిట్టిబన్న
బులఁ గూర్చితివా! మాయమ్మ వలదనివారించుటం జేసి, బ
తికిపోయితివిగాని లేకయుండినచో నీయంతం బింతకుమున్నే

చూచియుందునుకదా! (ఇంచుక యూరకుండి శశిరేఖనుద్దేశించి) హా! రమణీమణీ! శశిరేఖా!

తే. గీ. నాకుసతివౌదువనుచు మ  నంబునందు
సంతసంబునునంది యా  సగొని యుంటి
నక్కటా నాదుయాశ సి  రాసయయ్యె
గడుసురాత్ముండౌ సీతండ్రి  కారణమున.

మ. జననంబాదిగ నీదుసఖ్యమెపుడున్  చానా విడన్ లేదు నీ
జనకుండట్లొనరింప; ఘోరతనవా  సం బిట్లు సల్పంగ, వే
జనుదేరన్ బనియయ్యె నేమనుదునే  సంతాపమున్ బొందుచున్
మనమందున్ స్మరియింపుచుంటి నినునో  పద్మేందు బింబాననా.

తే. గీ. ముద్దులనుమూటగట్టు నీ  మోముతీరు
వెన్నెలలుగాయు నీనవ్వు  వన్నెలరయ
ధరణిచంద్రార్కు లిరువురు  వరలుదాక
మఱచిపోవుదమన్నను  మఱుపురావు.

అయ్యో! శశిరేఖా! నీతండ్రి యట్లొనరింపగా నలిగి, జననీసహితుండనై యిట్లరుదెంచితినని విని యెంతగానార్తి పరితపించుచుంటివోకదా! ఎన్నడును బాసియెఱుంగని నిన్నిప్పుడెడబాయవలసి వచ్చెనుకదా. (ఇంచుక యూరకుండి) ఇంకనే నక్కన్నియకై యిట్లుచింతించిన నేమిప్రయోజనమున్నది?

తే. గీ. భవ్యశశిరేఖనామ స  న్మంత్రమెపుడు
హృత్ఫలకమందునే లిఖి  యించియుండె
దాని స్మరియించుచెట్టులో  ధరణియందు
గాలమును వెళ్ళదీసెద  గరిమనింక.

(సుభద్రంజూచి) ఆహా! మాతల్లికి నామూలంబున నెట్టిగతి సంభవించినది. ఇంతకుం గారణంబు నేనేకదా!

సీ. శుద్ధాంతములయందు ॥ శోభిల్లువాతల్లి
ఘోరాటవిని నేఁడు ॥ గుండవలసె
కడుపారభక్షించు ॥ కమనీయవిగ్రహా
యుపవాసములదూలి ॥ యుండవలసె
పరిచారికల్ గొల్వ ॥ పరలుచుండెడిలేమ
ఘనమృగారావముల్ ॥ వినఁగవలసె
హంసతూలికపాన్పు ॥ నందలరెడికాంత
కటికిరానేలపైఁ ॥ గ్రాలవలసె
తే. గీ. నకట బలరాముచేసింత ॥ యార్తివచ్చె
(యించుకయూరకుండి)
నతనినననేల మాకర్మ ॥ గతికి భువిని
ధాతలిఖియించి వెలసిన ॥ వ్రాత కాదె
గాకయుండిన నీపాట్లు ॥ గలుగనగునె.

తల్లీ!

సీ. పటుబాహుశౌర్య సం ॥ పన్నుఁడై వెలసిన
పార్థుని మురిపెంపు ॥ బడతివయ్యు
విష్ణుస్వరూపుండు ॥ విశ్వరక్షకుఁడునౌ
వరవాసుదేవుని ॥ భగినివయ్యు
మహితశూరుడటంచు ॥ మంతుకెక్కిన నభి
మన్యుఁగాంచిన ॥ మాతవయ్యు
అపకారమేరికి ॥ నాచరింపనియట్టి
మహితసాధ్వీశిరో ॥ మణివియయ్యు
తే. గీ. నజుఁడు మోమునవ్రాసిన ॥ యట్టివ్రాత
కతన బండంగవలసెగా ॥ గానవిపిని

అక్కటా నినుజూచినా ॥ యాత్మయందు
శోకమేరీతి భరియింతు ॥ జాంకటముగ.

ఆహా! మార్గమున నడచినట్టి యాయాసంబుచే నీమె గాఢనిద్రను బొందియున్నది. ఈమెనిద్రకు నేనావంతయు భంగము గలుగ నీయరాదు.

[తెరలో]

అస్మదీయ పరిపాలితంబగు నిమ్మహారణ్యంబునందు నరులెవ్వరును జొచ్చుటకు సాహసింపరు. చిరకాలంబునకు వాటింటికి గుందేలువచ్చుపగిది నాకంట నరుండుపడినాడు. సంతృప్తిదీర వీనినాహారంబుగా గైకొందు.

అభి—(తనలో) ఆహా! ఇవ్విధి రాక్షససంచారముచే నిండిన ఘోరారణ్యముకాఁబోలు. తెలియక మోసపోయితిని. కానిమ్ము ఇప్పుడుమాత్రము మించినదేమున్నది. ఆయుధంబులు హస్తములందున్నవికదా. (ప్రక్కంజూచి) అదిగో! ఎవ్వఁడో యొక్క మృక్కడిరక్కసుండు భీషణాకారంబున భీకరాట్టహాసంబు గావింపుచు నిట్లువచ్చుచున్నాఁడు. కానిమ్ము వీనిమదంబు దూల్పెదఁగాక.

[ఘటోత్కచుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ఘటో—(అభిమన్యునిఁజూచి)

శా. ఘోరారామది భీతిలేకయె ముదం ॥ బొప్పార; మత్పాలితం
బైరాజిల్లెడి యువ్వనంబునకు నీవుం ॥ భక్తిల నేతెంచితే
ఘోరాస్త్రంబుల దాల్చితే కరములన్ ॥ గోపంబు గల్పించితే
క్రూరా! ప్రాణములైన నాసయిక నీ ॥ కున్ లేదె మర్త్యాధమా

అభి—ఓరోరి! రాక్షసాధమా!

మ. మా మందించుక భీతిలేక యిటువ | ర్తంబేర్చి యేతెంచి, నా
కునుభీతిన్ గొంపంగ బల్కుదెయిట్టుల్ కరూరా! ఘరాంబందకన్
ఘనబాణంబులచేత గూల్చెదనినున్ | శౌర్యంబు దీపింపగా
వినుతాటాకులచప్పుడుల్ వినినగుం | దేళ్ళందు భీతిల్లునే!

ఘటో—ఏమీ! నీకండకావరము.

సుగంధి.

ఘోరకాననస్థలంబు | కొంచమైన నెంచకన్
జేరవచ్చియిట్లు ధైర్య | చిత్తమెంతొ బూనుచున్
గారుకొన్న పేర్లుచుంటె | కన్నుమిన్నుగానకన్
జేరవచ్చినాడ నిన్ను | జెండివేయ నిప్పుడే.

అభి—అరే! రాత్రించర వంశాధమా! నీబెదిరింపుల కిక్కడ నెవ్వ
రునుజడియువారులేరు. నాకన్నులముందుబడి నీవెందుబోగలవు.

సుగంధి.

ఏలకారు లిట్లుబల్క | నింతలాభమున్నదే
యాలముందు నిల్చి ఘోర | మారసీకుణంబునన్
గూలనేయ నెంచినాడ | కోలచేత నియ్యదే
పాలిశా! రణంబువీడ | పాఱిపోకనిల్వుమీ.

ఘటో—ఓరీ! దురాత్మ! నేనా పాఱిపోవువాడను! నరభోజనుండ
నని నీకుఁదెలియదా! నిన్నిక్కడనే యిప్పుడు మట్టుబెట్టెదను

కవిరాజవిరాజితము.

అభి—శరణమువేడిన నిన్ విడకుండనె | సాగరరంగము నందిపుడే
బోరిగొని బాహుబలంబునుజూపుచు | భూరిశరంబునగూల్చెదనున్
వరమునులున్ సురబృందమునిత్యము | భావమునన్ ముదమం
దగనున్

ఘటో—బరువడిబీరములాడగ నేటికి | బాహుబలంబునుజూపుమికన్

అభి—ఇదిగో సంసిద్ధుండనై యుంటిని.

ఘటో—రణోచితస్థలం బదేయచ్చటనున్నది. రమ్ము.

(ఇరువురు నిష్క్రమించుచున్నారు)

సుభ—(నిద్రనుండి లేచి) కుమారా! (కన్నులు తెఱచి) ఏమిదీ! యభిమన్యుం డెచ్చటికేగెనోకదా! (దిక్కులు పరికించి) అన్నా! ఎంతమోసమువచ్చెను. ఇయ్యది రాక్షససంచారమగు నరణ్యంబని తెలియకఁ బ్రవేశించితిమి. అదిగో నాకుమారుండొక్కమృక్కడి రక్కసునితోఁ బోరుసల్పుచున్నాడు. అయ్యో! ఏమి మోసము వచ్చునోకదా! (అభిమన్యు నుద్దేశించి) హా! కుమారా! ఈరాక్షసునితో నేల పోరాటంబునకుఁ దలపడితివి. అయ్యో! మనకిట్టిగతి సంభవించినందుకే చింతింపుచుండఁ జింతలో మఱియొక చింత గూర్పుచుంటివా! (తేఱిపాఱజూచి) అబ్బ! వీరిపోరు మహాఘోరంబగుచున్నదే. ఈయిరువురందున నొకరికొకరు తీసిపోవువారు కారు. అయినను కయ్యంబున ఫాలాక్షుని నిర్జించిన ధనంజయుని గర్భంబున జనించిన యిక్కుమారుండొక్క మృక్కడిరక్కసునకు లెక్కబెట్టునా. (ఎదుటంజూచి) అమ్మయ్యా! ఇప్పటికినాకు ధైర్యము కలిగినది. అదుగో నారదుండు కాబోలు వీరిపోరాటంబును మాన్పదలంచి వచ్చుచున్నాఁడు.

[నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

నార—

ధ్రువకోకిల. జననమందిన యందు కెప్పుడు సంతసంబున భక్తితో
మనమునందున శ్రీరమేశ్వరు భవ్యతేజునిఁబుణ్యునిన్
వినుతిసజ్జనుభక్తరక్షకు విశ్వనాథుభజించినన్
ఘనముగామదిగోరియుంచిన కార్యమెల్లఫలించుగా.

జగన్మోహిని. అన్నదమ్ములంచు । నాత్మనెంచకే
జన్నెయిట్లు సేయ । న్యాయమందురే
గర్వ్యులరె రణంబు । గాంతుఁ జేసిరే
బన్నుగారణంబు । మానుడింకిటన్.

[అంతఘటోత్కచాభిమన్యులు ప్రవేశించి నారదునకు నమస్కరించుచున్నారు.]

సుభద్ర—(నారదునకు నమస్కరించుచున్నది.)

[ఒకరినొకరెరుంగక ఘటోత్కచాభిమన్యులు అరణ్యమున పోవుచుండ నారదుఁడు ప్రవేశించి పాడెడిపాట.]

సురటరాగము—ఏకతాళం.

ప॥ మీరిరువురిటులపోరఁదగును బాటునన్॥

అ॥ ప॥ ఆరయమీరిర్వురు పాండవ వంశోద్భవులుగారె॥ మీరిరు॥

ఘటో—నారదమునివర్యా యెటికిటులఁబల్కినారో దెల్పుఁడు ధీరుఁడ
ర్జునాత్మజుండు యభిమన్యాభిఖ్యుఁడితఁడు । భీమునిపుత్రుఁడవీరు॥
మీరిరు॥

నార—అభిమన్యా! ఇందాశ్చర్యమేమియు లేదు.

తే. గీ. సాధ్వియైనాయీసుభద్రకు । సవ్యసాచి
కీపుత్రుండవౌచును । నెగడలేదె

అభి—మహాత్మా! అదిసరియే.

నార—వాయుపుత్రునకును హిడింబ । కును బుట్టి
యాయమసీఘటోత్కచుఁడు తా । నలరెగాదె!

ఈవిధంబున మీరిరువురును నన్నదమ్ములుగదా!

అభి—ఏమేమీ! ఈతనుమా పెత్తండ్రియగు భీమసేనునిపుత్రుండగు
ఘటోత్కచుండా! (ఘటోత్కచునకు నమస్కరించును.)

ఘటో—మునీంద్రా! ఈతండర్జునుని పుత్రుఁడును, నాకుఁదమ్ముండు నునగునభిమన్యుఁడా! (అభిమన్యునిఁ జూచి) 7/34

మ. అనుజా! తమ్ముఁడనంచెఱుంగక సముద్యద్భూరికోపంబునన్
రణరంగంబుననీపయిన్ మిగులశస్త్రంబుల్ ప్రయోగించితిన్
ఘననీదేహము నెంతనొచ్చెనొకదా కార్యంబునేఁబూనుచో
వనమందాగ్రహమందఁబోకుమిక సౌభద్రా! సుధీరాగ్రణీ.

అభి—అన్నయ్యా తెలియక జేసినదాని కేమి! మనమీసంయమీంద్రుని కటాక్షంబున సుఖులమైతిమి.

సుభ—కుమారులారా! రణంబు జేసి మిగులయలసి యుంటిరి. ఇంచుక కాలము విశ్రమింపుఁడు.

ఘటో—అమ్మా మిమ్ము నెఱుంగక దుష్టకార్యంబుచేసితిని. నన్ను మన్నింపుము (నమస్కరించుచున్నాఁడు.)

నారద—పాండవకులజులారా! నేనిప్పుడు ద్వారకాపురంబున జరుగనున్న, లక్ష్మణుని వివాహంబీక్షింప బోవలయును. ఇంక నే బోయెదను.

సుభ—సంయమీంద్రా! నీమూలంబున నీకుమారులు సుఖవంతులైరి మీకృపను మేమెప్పుడును మఱువము.

(అందఱును నారదునకు నమస్కరించుచున్నారు.)

[భగవంతుని స్తుతించుచు నారదుఁడు నిష్క్రమించెడి పాట.]

బేహాగ్ రాగం—ఏకతాళం.

ప॥ జగముల్ । సుగమం । బుగ సృజియించిన । సర్వోపనిషన్మహిమల్ ।
బొగడుట కెవ్వరితరమా । యీత్రిజగములయందునయౌన్ ।
అ॥ ప॥ నిగమంబుల్ । చోద్యమునన్ । వినుతించెన్ । విరతుల్ ।
భగవంతునిమదినిల్పుచు సద్భజనంబును సల్పుమ మోలగవలెన్ । జగముల్

నార——(నిష్క్రమించును)

ఘటో——అమ్మా! ఈసంయమీంద్రుఁడు ద్వారకాపురమందు జరుగ నున్న లక్ష్మణుని వివాహమహోత్సవ మీక్షింపఁబోవుచుం టినని పచించెను. లక్ష్మణుండనఁగాఁ గురురాజగు సుయోధనుని సుతుండేకదా. ఆతని కెవ్వరిపుత్రినిచ్చిపరిణయముసేయుదురు?

సుభ——కుమారా! మాయన్నయగు బలరామునిసుతయైన శశిరేఖ నిచ్చి వివాహము కావింతురు.

ఘటో——ఏమేమి! శశిరేఖను లక్ష్మణునకొసంగి వివాహము కావిం చునా! ఆశ్చర్యముగనున్నదే!

తే. గీ. ఎల్లవిధములదగిన మే నల్లుడీత
డింటనుండ వీనివిడచి యేలకౌర
వేంద్రుని కుమారునకుఁ గన్నె నీయనెంచె
భవ్యగుణతేజుఁడా బల భద్రుఁడిపుడు.

సుభ——ఆకారణంబుచేతనేగదా కుమారసహితంబుగ నట్టడవి రావ సినగతి పట్టినది.

ఘటో——అమ్మా! అట్లు పలుకుచుంటివేమి! ఆకారణం బెఱుంగుటకు నాచిత్తంబు దత్తరపడుచున్నది. కృపఁబూని సత్వరంబుగ లవిమ్మా.

[అంత హిడింబ ప్రవేశించుచున్నది]

హిడిం——(ఘటోత్కచునిఁజూచి) వత్సా! వీరెవ్వరు!

ఘటో——అమ్మా ఈమె నాపినతండ్రియగు నర్జునుని దేవేరియగు స భద్రామహాదేవి! ఈతండు నాతమ్ముండగు నభిమన్యుఁడు. దై ధివశంబున వారీనట్టడవినిఁ బ్రవేశింప, నాకును దమ్మునకును ఘోరకయ్యంబు జరిగినది. కాని, నారదమునీంద్రుని కృపా టాక్షంబున మనబాంధవ్యము తెలిసికొనఁబడినది.

హిడిం—చెల్లెలా ! నిన్ను గుమారసమేతంబుగా నేఁడుపీక్షించుటంజేసి నా కెంతయో యానందముకలిగినది. అమ్మా ! మీరిట్లు వచ్చుట కేమికారణము ?

ఘటో—(సుభద్రంజూచి) తల్లీ ! ఆ కారణంబును జెప్పుము.

[అరణ్యమున దిరుగుట కారణంబేమని హిడింబసుభద్రనడుగ సుభద్రపాడెడిపాట.]

సాం॥ తోడిరాగం—ఏకతాళం

ప॥ నేనేమనిదెల్పుదుసోదరీ । నీవెరుగనిదా॥ నేనేమని॥

అ॥ ప॥ మేనమామలయింటన్ । చిన్నతనమునుండియు బెరిగెనుగద॥ యీనాసుతుడభి । మన్యుడుదలపన్ । యెంతో ముదమున మొదటనుండియు ।

వీనికెమాశశిరేఖనిత్తునని । వేవిధములభాసజేసి మమ్ముల । కానిమాటలనితుదకు యిట్టులనె ।

నీనాథునకున్ । తినుటకుకూడున్ । మనుటకుతావున్ । లేనేలేదుగదాయనిధనమున । కాసజెందెదుర్యోధనాత్మజునకిచ్చె ముహూర్తమునిశ్చయపరచెన్ । నేనేమని।

సుభ—ఈయభిమన్యుండు పిన్ననాటనుండియు, మేనమామలయింట బెరుగుచుండెనని నీకుఁదెలియునుకదా. బలరాముండు శశిరేఖను మొదటనుండియు వాగ్దానముచేసి, యిప్పుడు మేము కడుబీదలమై యుంటిమనితలంచి, దుర్యోధనసుతుండగు లక్ష్మణునకీయ నెంచెను. అంతియేగాక మమ్మును పాండవులను నతిదూషించెను. అట్టివారిగృహంబున నింకనుండుటకు జిత్తంబు మ్మతింపకుండుటంజేసి యిట్లువచ్చితిమి. నిన్నుఁజూడగంటిమి ఆనందంబందితిమి.

ఘటో—ఏమేమీ ! బలరాముండే యిట్లుచేసెగా ! (బలరాము నుద్దే
శించి) ఓరీబలరామా ! యాదవకులపాంసనా !

శా. ఏమేమీ ! భయమింత లేకమదిలో నిట్లాడితే దుర్మతీ!
కామక్రోధమదాంధకార ! తులువా గర్వంబునుంబూని, నీ
వామూర్ఖ పాండురాట్సుతుల నత్యంతంబు దూషించితే
భూమిన్నీతల ద్రెళ్ళ సేతునిదిగో పూర్ణప్రతాపమ్మునన్.

ఓరీ ! యవివేకీ ! పాండవేయుల కాలిగోరునకైనను నీవ్రసముండవగుదు
నా ! (సుభద్రంజూచి) అమ్మా ! ఇట్టిసంబంధము చేయుటకు
గృష్ణుండంగీకరించెనా !

సుభ—వత్సా ! ఘటోత్కచా ! శశిరేఖచిత్త మభిమన్యునియందే ల
గ్నంబైయున్నది. కృష్ణుండును, రేవతియు నీసంబంధమువలదని
యు, నభిమన్యున కీయవలసివదనియు, నెక్కునక్కాణించిరి
గాని, శశిరేఖాభిమన్యుల పరస్పరమోహానుబంధంబైనను వి
చారింపక బలరాముం డిట్లుసేయనెంచెను.

ఘటో—కానిమ్ము. తత్ఫలంబతడు గుడుచుగాక. మేనల్లుడింటనుండె
ననియైనను జూడక నీసంబంధంబు నాసుయోధనుం డెట్లుగోరె
నో. దుష్కర్ములకు యుక్తాయుక్తవిచారణ మెట్లలవడును? (అ
భిమన్యునింజూచి) తమ్ముడా! వివాహమెప్పుడు జరుగనున్నది ?

అభి—అగ్రజా ! వివాహముహూర్తము రేపే! సుయోధనాదులీపాటికి
వచ్చియేయుందురు.

ఘటో—అట్లనా ! కానిమ్ము. తమ్ముడా ! ఇంక నాలోచింపనవసరము
లేదు.

మ॥ మనమందెంతయు సంశయింపకుము భామారోరత్నముం
ఘనమాయాబలమేర్పడంగ నిటువేగన్ దెచ్చి; యుద్భటన్

కును నుద్వాహము సల్పెదన్ వినుముని కోర్కెల్ దీరగా
మనమందా సతి నీదెసాన్నయనుచున్ భావింపుమీ తమ్ముడా.

అభిమన్యా! ఇంక నాలసింపజనదు. నేమాయాబలంబున శశిరేఖం దెచ్చి వారేర్పఱచిన ముహూర్తంబునకే నీకిక్కడ వివాహంబు గావించెద. నాకెవ్వరైన నడ్డమువచ్చినచో మదముడూలించెదగాక.

అభి—అన్నయ్యా! అనలంబునకు వాయువు సహాయుడైనట్లు నేను నీకు సహాయుడనగుదును. ఆచిత్రము నేనుగూడ జూచెదను. నన్ను గూడ గొనిపొమ్ము.

హిడిం—వత్సా! నీకోరికదీర్ప నీఘటోత్కచుండు చాలును. నీవేగ నవసరములేదు. ఆతండే శశిరేఖను దోడితెచ్చును.

ఘటో—తమ్ముడా! నీవిచ్చట తల్లులను జూచుచుండుము. నేనొక త్రుటిలో శశిరేఖం దెచ్చెద.

అభి—అగ్రజా! నీయాజ్ఞననుసరించెదగాక.

విభూతి.

ఘటో—మానసంబునందికన్ బూనుమీనుడంబునన్
మానినీశిరోమణిన్ నేనుదెచ్చెదన్ త్వరన్.

(నిష్క్రమించును)

సుభ—(హిడింబనుజూచి) అక్కా! కుమారుండగు ఘటోత్కచుండరిగెనుగాని నామనంబుమాత్రము సందియమందుచున్నది. యాదవకౌరవవీరులచే నీతనికేమి ముప్పువాటిల్లునోయని భయము కలుగుచున్నది.

హిడిం—సుభద్రా! ఘటోత్కచుని విషయమై నీవేమియు సందియమందవలదు. అతడు మహామాయాబలసంపన్నుడు. రిపులకు లక్ష్యపెట్టువాడుకాడు. ఆతండీపాటికి వచ్చుచునే యుండు

సుభ—ఇంతలోనే వచ్చునా!

హిడిం—ఆకాశ సంచారినై మాయాబలంబున నేగివచ్చుట కెంత కాలము కావలెను.

[ఘటోత్కచుఁడు శశిరేఖతోఁదల్పసహితముగ ప్రవేశించును.]

ఘటో—(అభిమన్యునిఁజూచి)

మ. ఇదెనీగోరినయట్టి కన్యకముదంబే పారగాఁ జూడుమీ

(సుభద్రింజూచి)

ఇదెనీకోడలు; చంద్రబింబసమ నీ వీక్షింపు మాగళ్లిరో
మదిరాక్షీమణిఁదోడిదెచ్చితిని నా మాయాబలంబేర్పడన్
మదిరంజిల్లగ బెండ్లి జేయుదమికన్ భవ్యప్రమోదంబునన్.

సుభ—వత్సా! నీకసాధ్యమైన కార్యమేమున్నది?

అభి—(తనలో) ఇప్పుడుకదా! నాకుసంతోషముకలిగినది. (ప్రకాశముగా) అగ్రజా! నాకైయెంత శ్రమంబునొందితివోకదా.

[ఘటోత్కచుఁడు తనమాయాబలంబున శశిరేఖందెచ్చి యభిమన్యుని చెంతజేర్ప యభిమన్యుఁడు పాడెడిపాట.]

కమాచ్ రాగం—ఆదితాళం.

ప॥ సోదరా సోదరా నాహృదయము। ముదమొదవగ। పదిలపడగ జేసితివాహా॥

అ॥ ప॥ నీదుశక్తి కేమనందు। యెంతనినేనినుబొగడుదు నాదుప్రాణ ధనమగు యీ। శశిరేఖన్। శత్రులకన్। దాటిదెచ్చితి వాహాహా। సోదరా॥

ఘటో—తమ్ముఁడా! ఇది మనకు శ్రమకాదు. మహాసంతోషము.

[శశిరేఖ—నిద్ర లేచుచున్నది.]

శశి—(లేచి కన్నులునలుపుకొనుచు) ఏమిది! నేనెచ్చటబండితిని. ఎచ్చట మేల్కొనియుంటిని. ఈఘోరారణ్యంబున కెట్లువచ్చితినో కదా! (సుభద్రాభిమన్యులంజూచి నామనోహరుండగు అభిమన్యుండును, అత్తయగు సుభద్రయు నిచ్చటనున్నవారే! ఆశ్చర్యముగనున్నదే! ఒకవేళ కలగాంచుచుంటినా! కాదు కాదు జాగ్రదవస్థయందే యుంటిని.

సుభ—(శశిరేఖంజూచి) అమ్మాయీ! శశిరేఖా! భీతినొందకుము. ఇదుగో నీమనోహరుండగు నభిమన్యుండు. ఈతండు నిబాంధవరగు ఘటోత్కచుండు. లక్ష్మణునకీయ నెంచిననిన్ను మాయాబలంబున నీతడిచ్చటకుదోడ్కొనివచ్చినాడు. ఇంక సంతోషింపుము

(అరణ్యమునందున్న సుభద్రాభిమన్యుల శశిరేఖజూచి పాడెడిపాట.)

బేహాగ్ రాగం—ఏకతాళం.

ప॥ యేమనందునాభాగ్యము ॥ఆహాహా॥

అ॥ ప॥ నామనంబున నొందలంబడెంగాక । యామానందమొదవె॥ యేమనందు॥

యీామహాబలాఢ్యుడునా । కీతరిభగవంతుడె నామనోహరునిసన్నిధి । నన్ను జేర్చినాడహాహా॥ యే॥

శశి—(తనలో) ఏమినాభాగ్యము! ఈఘటోత్కచుండు నాపాలిటికి భగవంతుఁడయ్యెనుగదా!

ఘటో—తల్లులారా! నేనిప్పుడు ద్వారకాపురమునకేగి యచ్చటనై

వాహీకచిత్రంబులు జూడవలయును! మీరిచ్చుటవివాహప్రయత్నము జరుపుచుండుడు. నేనిదేయేగెదను.

సుభ—మున్ను మీతండ్రులు దుర్యోధనదుశ్శాసన కర్ణులయెడల జేసప్రతిజ్ఞలు జ్ఞప్తియందుంచుకొనుము.

ఘటో—మంచిది.

(నిష్క్రమించును.)

హిడిం.— చెల్లెలా! మనమింక యాశ్రమంబునకేగుదము. రండు.

(అందరు నిష్క్రమించుచున్నారు.)

దిఇ తృతీయాంకము.





శ్రీ

# శశిరేఖాపరిణయము.

## చతుర్థాంకము.

[ద్వారకానగరమున సౌధమున శశిరేఖాకృతితో ఘటోత్కచుఁడు ప్రవేశము]

శశి — (తనలో) భళా! శశిరేఖను నాయాశ్రమంబున నభిమన్యునివద్దనుంచితికదా. నావేషమంతయు శశిరేఖవలెనేయున్నది. నన్నుఁజూచియెవ్వరును నానవాలుపట్టలేరు. ముహూర్తముకూడ సమీపించుచున్నది. పెండ్లికూతురనుగదా యనితలంచి నన్నుఁదోడ్కొనిపోవుటకుఁ జెలికత్తెలు వచ్చెదరుకాబోలు. ఆ సమయంబున నేనుసహజమైనశశిరేఖవలెనే నటించుచు, నభిమన్యునిపై జిక్కియున్నయనురాగంబునుగూర్చి విచారింపుచునుండెదగాక. (ప్రక్కకుఁదిరిగిచూచి) అదిగోచెలికత్తెయగు భాసతివచ్చుచున్నది. అభిమన్యునిగూర్చి సంతాపమందుట నటింపవలెను. (అభిమన్యునుద్దేశించి)

ఉ॥ హాసుకుమారగాత్రసుగుణాకర! హాచిరపుణ్యశీల; యో
హా సరసీరుహాక్ష! సుజనావన! నాదగుతండ్రిమాటపై
నీసు జనించిరోసమున నీదగుతల్లియు వెంటరాగ, నన్
బాసియరణ్యభూమికి జనంగనున్యాయమెయర్జునాత్మజా.

అయ్యో! చిన్ననాటనుండియు నీవేనాకుభర్తవగుదువని యెతయో మురిసితినే! అక్కటా! నాయాశలెల్ల నడుగంటినవికదా నీస్తు

నాగళంబున మంగళసూత్రంబు గట్టుదువని తలంచితినిగాని, యీ కురుకుల పాంసనుండగు లక్ష్మణుండు గట్టునని కలయందైనను తలంపనైతినే. (బలరామునుద్దేశించి) హా! తండ్రీ నాయెడల నెంతక్రూరత్వము వహించితివి!

తే. గీ. తండ్రి! యభిమన్యుపైనఁ జిత్తంబుదగిలి
యుంట నీమదికిదెలిసి యుండి; యిట్లు
గొంతుగోయంగ నెంచితే కోర్కెతోడ
కటకటా యేమనందు నా కర్మగతికి.

(అభిమన్యునుద్దేశించి) అభిమన్యా! మారసమానసుందరా! నీరూపంబు నాకనులయెదుట బ్రకాశింపుచున్నదికదా. అయ్యో! నీపైజిక్కియున్న నామనంబాలక్ష్మణుని నెట్లువరించును!

[భారతి ప్రవేశించు చున్నది.]

భార—(శశిరేఖను సమీపించి) చెలీ! శశిరేఖా! ఇంకనునీవిట్లేయుండి సంతాపమందుచుంటివా! వివాహముహూర్తమింక మూడుఘడియలున్నదని నీకు దెలియదా. లెమ్ములెమ్ము.

శశి—(నిట్టూర్పుపుచ్చుచు) ఉమ్. నన్నెందుకుఁజంపెదవు. నీవు నన్ను మాటలాడించక నూరుకొనుము.

భార—అమ్మా! అట్లందువేమి? లేచిరమ్ము.

శశి—ఎచ్చటికిరమ్మందువు?

భార—పెండ్లిపీటలమీద గూర్చుండుటకు.

శశి—పెండ్లిలేదు పెటాకులులేవు. పీటలులేవు చాటలులేవు. పొమ్ము నామనంబంతయు డోలాయమానమైయున్నది. అతిగామాటలాడించకుము.

భార—అయ్యో! సఖీ! ఎంతమాటపలికితివి! శుభసమయంబున నట్లనరాదు. నీసంతాపంబునకు గారణంబు నేనెఱుంగుదును. చిం

తించినందువలనఁ గన్నులువాచుటతప్ప వేరొండుప్రయోజనం బేమియు లేదు. ఎంతపరితాపమందినను నభిమన్యుఁడింక రాఁడు. లక్ష్మణుండే నీభర్తయని యవ్విరించినీనుదుట మూఁడుబంతు లవ్రాసినాఁడు. ఇంకనీవాయభిమన్యునిపై యనురాగంబును ద్రెంపివేయుము.

శశి — అక్కటా ! ఎంతమాటచెప్పితివి ! అభిమన్యునిపై బ్రాఁకిన నా యనురాగలతను ద్రెంపుటయెట్లు. జీవంబులున్నంత వరకును నదినాహృదయంబున నుండునదే. (అభిమన్యునుద్దేశించి) హా ! సుభద్రాకుమారా !

తే. గీ. నీగుణంబులు నీప్రేమ ♦ నీదురూపు
నీవిలాసంబు నీనవ్వు ♦ నిక్కముగను
నాదుమానసంబందున ? నాటియుండె
మఱచిపోవ్రదమన్నను ♦ మఱుపురావు.

(కన్నీరుసించును.)

భార — చెలీ ! నీవావిషయమునుగూర్చి యింక దఃపెట్టి చింతింప కుము.

తే. గీ. కౌరవేంద్రుని సుతుఁడె నీ ♦ కాంతుఁడంచు
మూఁడుబంతులువ్రాసె నీ ♦ మోమునందు
ధాతదానినిదప్పింప ♦ దరముగాదు
చింతఁబొందఁగ నేటికి ♦ స్వాంతమందు

అమ్మా ! నీవిట్లు చింతింపుచున్నచో నెవ్వరైనను వినిపరిహాసింతురు నామాటవినుము. ఇంకరమ్ము.

శశి — నీవెంతచెప్పినను వినకుంటివే నీకు బుద్ధిలేదా యేమి ! ఆ కుఱ్ఱమాలిన పెండ్లితో నాకేమిపనియున్నది. పెండ్లియైన సరే. పెటాకులయినను సరే. నాకవసరము లేదు. నాదా

ను జూచుకొనెదను. అభిమన్యాసక్తమైయున్న నాచిత్తంబా తుచ్ఛుండగు లక్ష్మణుని వరింపదు. వేయేల. నేనురాను నీవు పొమ్ము.

భార—అమ్మా ! ఎంతచెప్పినను వినకున్నదానవు. నీకు బాగోగులు తెలియవు. వాపోవుచున్న భర్తట్లు దూషింపరాదు. పడతులకు భర్తదైవసముండుకదా.

శశి—నీవుచెప్పిన వాక్యం బిచ్చట నన్వయింపదు అన్యోన్యానురాగంబులేని వధూవరుల సంబంధమేల. కాల్పనా ! నాబాల్యంబునుండియు నాభర్తయనియు, దైవసముండనియు, సౌభద్రు నిదలంచి యుంటిని. కురుకులపాంసనుండగు నీలక్ష్మణుండెవరు. ఇయ్యది నాపురాకృత ప్రారబ్ధవశంబున గదా సంభవించినది. ఇందుకు నేనోడంబడుదునా !

తే. గీ. ఎల్లవిధములు దగినమే నల్లువిడచి
కురుకులాధముకు నన్నుఁ గోర్కెతోడ
నిచ్చుచుండెను సంపద కెంతయుబ్బి
గొంతుకోయంగ గాదొకో కోమలాంగి.

కానిమ్ము. అందులకు దగినఫలంబు నాతండ్రి యనుభవించుగాక. నీవేగుము. నేనురాను. (ముసుగువేసికొని పండుకొనుచున్నది.)

భార— (తనలో) అక్కటా ! ఈమె మౌర్ఖ్యము వహించి యెంత చెప్పినను వినకున్నది. ఈమెను దీసికొనిపోవుటకు నాకుదరంబుగాకున్నది. ఈమెతల్లియగు రేవతీదేవిని దోడ్కొనివచ్చెద. ఆమెచెప్పినంగాని వినదు, (నిష్క్రమించి వెంటనే రేవతితోఁ బ్రవేశించుచున్నది )

రేవ—(శశిరేఖనుజూచి అమ్మాయీ ! శశిరేఖా ! లెమ్ము. లెమ్ము.

శశి——అమ్మా! నన్ను లేపకుము. నాకుదలనొప్పి యత్యధికంబుగ నున్నది.

రేవ——కుమారీ!

[దుర్యోధనకుమారుండగు లక్ష్మణునకు పెండ్లి జేయుదురని శశిరేఖ విచారించుచుండ తల్లియగు రేవతిపాడెడిపాట.]

ఫీలువరాగం——ఏకతాళం.

ప॥ తనయా విను మా। తగదుయిటుల వగలుబొగల॥

అ॥ ప॥ మనమునసీవిధమున దిగులొందిగుందెద యెన్నిదినములు చింతించిన నీకేలయా ను యభిమన్యుడు ॥తనయా॥

గనుగొనలక్ష్మణుడేసీ। కాంతుడనుచు మువ్వొటికి నీనుదుటన్। లిఖియించె। నీరజగర్భుడు దృఢముగ ॥తనయా॥

చం॥ చినతనమాదిగామదిని । శిష్టగుణుండభిమన్యుడేధవుండనిదలపోసియుంటివిక । టా యది వ్యర్థమెయయ్యెనీ యెడ ఘనకృపబూనడా యెకద । మాధవుడేమనిచెప్పదమ్మ, యా వనజభవుండు జేసెనటు । భర్తగలక్ష్మణు నారసిల్లుమీ॥

ధాతవ్రాత దప్పించుటకు నెవ్వరితరంబును గాదు. ఇంకనాయభిమన్యుడు నీకుబతియగునను యాస మనంబునబరిత్యజింపుము.

శశి——తల్లీ! నీవెందులకిట్లు పలికెదవు. అభిమన్యాధీనమై యున్న నా చిత్తంబు లక్ష్మణునివరింపదు. అంతకంటె నేను ప్రాణంబుల ద్యజించి సుఖించుటయే మేలు. కావున నట్టి పని జేసెద.

రేవ——తల్లీ! నీవెంతయు వెఱ్ఱిదానవు. ఏమియు దెలియదు. సమస్తంబును భగవదాధీనము. బాల్యంబునుండియు నభిమన్యుని గోరియుంటివికదా, నీకోరిక నెరవేరినదా! చచ్చెదనని చెప్పుచుంటివి. అయ్యదిమాత్రము మనస్వాధీనమా! చావును

వలసినప్పుడు వచ్చునా ! పిచ్చికూతురా ! ఎంతమాట
లికితివి.

శశి—అమ్మా ! నన్ను వెఱ్ఱిదానవని పలుకుచుంటివి. నాహృదయ
మునను‌న్న సంతాపము నీకేమి తెలియును. ఇట్టివివాహము
జేసికొని దుఃఖించుటకన్న చచ్చుట శ్రేయస్కరముకదా.
భిమన్యుని పెండ్లియాడుట నాస్వాధీనముకాదుకాని మృత్యు
నాస్వాధీనంబునందే యుండెను. చూడుము.

చ. అనలము లేదె; కంఠమున ॥ హారమునందున రత్నముండదే
ఘనగరళంబు లేదొ వర ॥ ఖడ్గము చేతికిఁ జిక్కకుండునే
వననిధులెల్లయింకినవె ॥ బావలు తాళ్ళదునుగల్గదొ కొ్కయీ
తనువు బరిత్యజించి పరి ॥ తాపము వీడి సుఖంబునందగన్.

రేవ—అమ్మా ; ఇట్టి శుభసమయంబున నట్టియమంగళవాక్యలబు
నుచ్చరింపకుము. నామాటవిని పిచ్చిపట్టుపట్టక సత్వరము
రమ్ము.

శశి—అమ్మా ! ఇందుపట్టుదలయేమున్నది ? నాకెందుకిట్లు చెప్పెదవ

రేవ—పిల్లా ! మూర్ఖతవహింపకుము. ఇట్టిసంగతి పెండ్లికొడుకువా
విన్నచో నగుబాట్లుతప్ప మరేమియు లేదు. లోకులెల్లరును
హార్షించరు. అదియట్లుంచుము, నీవింకను నభిమన్యునిపై
మోహంబు విడువకుంటివి. లక్ష్మణుండుమాత్రము సామాన్యు
డని తలంచితివా యేమి ?

భువనైకసుందరి.

మారసముని సు ॥ మహితసద్గుణు ॥ మాన్యతేజుని ధీరునిఁ
గారవేంద్రజు ॥ కంజనేత్రిన ॥ కల్మషుని సుచరిత్రునిన్
ధారుణీధర ॥ ధైర్యచిత్తును ॥ ధర్మనిజూడుమిక నిం
పారగాభువ ॥ నైకసుందరు ॥ నాత్మయందునయుదమునన్.

ఇంక నామాట కెదురాడక నిట్టిచిక్కుబున్నులు మానిరముగ్ధ
(చేయిఁబట్టుకొని భారతిత్రో నిష్క్రమించుచున్నది.)

రంగము:—వివాహమందిరము.

[దుర్యోధన, కర్ణ, భీష్మ, ద్రోణ, కృపాశ్వత్థామలు
ప్రవేశించుచున్నారు.]

దుర్యో—మిత్రమా ! కర్ణా ! బలరామునకు నాయందధిక ప్రేమకదా!
ఆ కారణముచేత నేకదా !

కర్ణు—అందుకనే కృష్ణుని ప్రతిజ్ఞలు సాగినాయి.

బల—తే. గీ. ఆబలుండు మనదెస నలరెనేని
బవరమున గెల్వవచ్చును పాండుసుతుల
బలునిపేక్షించి రుక్మిణీ వల్లభుండు
జేరడే మనపక్షంబు శీఘ్రగతిని.

భీష్మ—వత్సా ! నీవెప్పుడును నిట్టితలంపులనే తలంపుచుందువు. బలరాముండు నీసుతునకుఁ గూతురునొసంగినంతమాత్రమున, గృష్ణుండు నీపక్షమవలంబించునా ! నీవట్లెప్పుడును తలంపకుము.

కర్ణు—(దుర్యోధనునిఁజూచి) రాజా ! కౌరవేశ్వరా ! నీవు నిజము వక్కాణించితివి.

ద్రోణు—దుర్యోధనా ! నీవు చెప్పుటకును నీతండు సరియనుటకును సరిపోయినది.

భీష్మ—వత్సా ! సుయోధనా !
తే. గీ. ఆబలుఁడు బాల్యమాదిగ నతనిసుతను
నర్జునాత్మజునకునిత్తు నంచుఁబలికి
యలరె; నాకతంబునవివా హంబునమ్మజాల
నాతియభిమన్యుసొమ్మంచు నమ్మమయ్య.

దుర్యో——ఏమి ! పితామహా ! అట్లుపలుకుచుంటివి ? బలభద్రుఁ
నాయెడలగల కరుణచే నాతనిపుత్రిని నాపుత్రునకిచ్చి పరి
యముసేయదలంచెను. వివాహలగ్నంబించుకముహూర్తకా
మున్న దికదా ! మనమందరమును పెండ్లికైవచ్చితిమి. ఇట్టి
మంగళవాక్యంబులు నీబోటిపెద్దలాడదగదు.

ద్రోణు——దుర్యోధనా ! భీష్మాచార్యునిపలుకు సత్యమే.

తే. గీ. బలునకీయంగ మదిలోన ✱ వాంఛయుండె
మాధవుండిష్టపడలేదు ✱ తన్మాతలేంద్ర
యతఁడెయేదైనభంగంబు ✱ మదినిదలప
సేయదలపడె మనలకు ✱ శీఘ్రగతిని.

దుర్యో——ఏదైనశుభకార్యంబులయందు మీరెప్పుడును నిట్టివాక
బులనే పలుకుచుందురు. బలరాముండు తనసుతను తనకిష్ట
చ్చినవారికిఁ బెండ్లిసేయుచుండగా, నిందుఁగృష్ణునియువసర
మున్నది. మీవాక్యంబులుజూడ నిప్పుడువివాహముసాగదని
యభిప్రాయముగలుగుచున్నది. చాలు. చాలు. ఇంక నెప్ప
ను నట్టివాక్యంబులాడకుఁడు.

కర్ణు——రాజా ! నీవు వీరి పిఱికిమాటలనుద్రావి యధైర్యపడకుము.

అశ్వ——సహజధైర్యచిత్తుండవు నీవురారాజునకు ధైర్యంపుమందు
పోయుము.

కర్ణు——తే. గీ. సకలభువనైకజాలంబు ✱ శౌర్యమూని
యెత్తివచ్చిన భయమంద ✱ నింతయైన
మాధవుండెంత నాముందు ✱ తన్మాతలేంద్ర
వీరిమాటలునమ్మకు ✱ వెఱ్ఱివగుచు.

ద్రోణు——కర్ణా ! నీబింకములుచాలింపుము. నీశౌర్యమెవ్వరికిదె

దు. "వోటిబానకు శబ్దమెక్కు" వను వాక్యము నీయందేయను కూలించెను.

కర్ణు—ద్రోణాచార్యా! చేసినను చేయకపోయినను వీరవిహారంబు నేనే చేయవలయును. తిండికై రాజుం జేరిన మీరేమిసేయగలరు.

అశ్వ—ఓరీ! దుర్మతీ! సూతకులప్రసూతా! ఏమిరా!

తే. గీ. అందరికి సత్రగురుఁడౌచు ♦ నలరునితని
నేమియో పేరులుచుంటివి ♦ హీనచరిత
కారవేందు నిరీక్షించి ♦ యూరకుంటి
కాకయుండిన నఱుకనే ♦ ఖడ్గమునను.

[తెరలో]

[మంగళధ్వని వినిపించును.]

దుర్యో—(తనలో) ఇంకనీరికి నేనూరుకొన్నచో వాక్కలహంబు వృద్ధియగును. (ప్రకాశముగా) భీష్మద్రోణులారా! పెండ్లివారు వచ్చుచున్నారు. వివాహముహూర్త మాసన్నమైనది. ఇట్టిసమయములో మనమిట్లనుకొనుచున్నచోఁ జూపరులువిని పరిహసింతురు. కావున తాల్మివహించి యూరుకొనుఁడు.

[బలరామాదియాదవులు ప్రవేశించుచున్నారు.]

దుర్యో—(బలరాముని వీక్షించి)

తే. గీ. ఎవఁడునృపులందుమేటియై ♦ యెగడునట్లు
సత్కృపంబూనినన్ గదా ♦ సమరమందు
కోవిదునిగాగ నొనరించెఁ ♦ గోర్కెతోడ
నట్టినీకు నమస్కార ♦ మనఘమూర్తి.

(అని నమస్కరించుచున్నాఁడు.)

కర్ణు—(బలరామునింజూచి) కౌరవశ్రేయస్కామా! బలరామా మీప్రియశిష్యుఁడునురారాజునునగు, మాసుయోధనునియందు మీకుఁగల వాత్సల్యముచేతనే యీతనితో మీరు వియ్యమందఁ గంగిరి. విక్రమోద్దామా! బలరామా!

బల—

సీ. ఇదికదాసుదినంబు ♦ తుదిలేనిసిరిచేత
   వెలరునీవియ్యంబు ♦ నందినాఁడ
ఇదికదాసుదినంబు ♦ మదిరాక్షిశశిరేఖ
   కునుదగుభర్తను ♦ గూర్చినాఁడ
ఇదికదాసుదినంబు ♦ నెంతైనసత్కీర్తి
   యవనీశులందున ♦ నందినాఁడ
ఇదికదాసుదినంబు ♦ మదియందునిష్ఠతో
   జేసినపూజలు ♦ వాసిగాంచె

తే. గీ. కలరెననుఁబోలుధన్యులు ♦ తలఁపమదిని
నన్నివిధముల ధన్యుండ ♦ వైరిమిగుల
కురుకులంబుతోనిప్డు చు ♦ ట్టరికమబ్బె
నదియెపదివేలు నాకింక ♦ నవనియందు.

దుర్యో—మహాత్మా! శిష్యునియందు మీరెప్పుడును గృపఁబూనియే యుండిరికదా,

విష్ణుశర్మ—అయ్యలారా! ఈమాటలకేమి! వివాహముహూర్తము సన్నమగుచున్నది. పెండ్లికూతురు యింకనురాదేమి?

బల—అదిగో! పెండ్లికుమార్తెను దీసికొనివచ్చుచున్నారు.

[శశిరేఖ భారతితోఁ బ్రవేశించుచున్నది.]

భార—చెలీ! శశిరేఖా! దీనభావంబును విడనాడి, యసహ్యము

నుపలుపక, మహాసంతోషితస్వాంతవై యఖిలలక్షణలక్షితుం
డగు లక్ష్మణునివీక్షింపుము.

మ. చతురంభోధిపరీతముద్రిత మహీ శ్రీ చక్రంబు బాలించు నా
యతబాహాబలుడౌ సుయోధనుఁడదే శ్రీ యాపక్కనున్నాఁడు, త
త్సుతుడౌలక్ష్మణబాలకుండు గనుమీ శ్రీ శోభిల్లగానాతఁడే
పతియౌనీకును, సంతసింపుమిఁక నీ శ్రీ భావంబునన్ సుందరీ.

విష్ణు——ఇంకను నాలస్యము సేయుదు వేమి? వేళలేదు. పెండ్లికుమారిని
గూర్చుండబెట్టుడు.

(అట్లుచేయుచున్నారు.)

భీష్మ——(విష్ణుశర్మంజూచి) భూసురోత్తమా! ఇంక నాలస్యమెందుకు?
కానిండు,

విష్ణు——ఇదిగో! (భజంత్రీలనుజూచి) భజంత్రీలు మేళంచెయ్యండిరా!

(మంగళధ్వనులు మ్రోగును.)

విష్ణు——అయంముహూర్తస్సుముహూర్తోస్తు.

దుర్యో——(లక్ష్మణునిజూచి) కుమారా! ఇంక తెరదీసెదరు. నీమనోహ
రిని వీక్షింపుము.

(తెరఁదీయుచున్నారు.)

లక్ష్మ——(శశిరేఖంజూచి) అబ్బా. చూడఁజాల! చూడఁజాల.

(కన్నులుమూసికొనుచున్నాఁడు.)

దుర్యో——కుమారా! కన్నులు తెరచి చూడుము. శశిరేఖాశరీర సౌం
దర్యప్రభలు నీకన్నులకు మిఱుమిట్లు గొలుపుచున్నవి.

లక్ష్మ——(కన్నులు తెఱచి చూచి) అయ్యో! ఏమిది! కన్యగాన్పిం
చ దేమి?

దుర్యో——కుమారా! అట్లనెదవేమి! మాకందరికిని గనిపించుచుం
నీకుఁగనిపింపకున్నదా? చాలు. చాలు. చూడుము.

లక్ష్మ—(చూచి) అయ్యయ్యో ! ఏమిదీ ! కన్నులు తెఱచి చూచినంత నే నాదేహము కంపమెత్తుచున్నది. సర్వంబును గూర్చుండఁ బెట్టి పెండ్లికూతురనుచుంటి రేమి ? పడగవిప్పికొని నన్నుగఱవనుంకించుచున్నది నేనిక్కడనుండఁ జాలను. (వణఁకుచున్నాఁడు.)

దుర్యో—

తే. గీ. చారుశారదపూర్ణిమా ౹ చంద్రవదన
హలధరునిపుత్రి నీకాంత ౹ యచటనుండఁ
దగునెసర్పంబటంచును ౹ దలఁపనీకు
మతిచెలించెనా యేమి ! కు ౹ మారచంద్ర.

భీష్మ—వత్సా ! లక్ష్మణా ! చంద్రబింబసమానయగు శశిరేఖంజూచి పామందువేమి ?

కర్ణు—నాగుబామును బోలియున్న యామెకీలెడంజూచియట్లనుకొంటివా యేమి ? భయపడకుము.

లక్ష్మ—అయ్యో ! ఆమెకీలెడకాదు. ఇప్పుడు మఱియొక రూపము దాల్చినది. అదిగో కోతిరూపము దాల్చి పండ్లకిలించుచున్నది. నేనిచ్చటనుండఁజాల. (లేవబోవును)

[సభ్యులందరును చప్పట్లుకొట్టుచు నవ్వుచున్నారు.]

దుర్యో—లక్ష్మణా ! ఎన్నఁడును నిట్లుపలికి యెఱుంగవే ! మతిపోయినదా లేక భూతమేమైనసోకినదా ! భయపడకఁజూడుము.

లక్ష్మ—అయ్యో ! నాకు మతిపోలేదు. దయ్యముపట్టలేదు. నిజముగా యట్లున్నది. కన్నులు తెఱచినచో నాకు భయముగచున్నది.

కర్ణు—లక్ష్మణా ! దుర్యోధనాత్మజుండవై సాటిబందుగులలో నగుపాట్లు దెచ్చుచుంటివికదా !

భీష్మ— వత్సా ! భయపడకజూడుము. మాకందరికిని నీకుగానుపించు చున్న రూపంబుగాన్పించదేమి ! కన్నులు తెఱవుము.

లక్ష్మ—(కన్నులు తెఱచి) అదిగో మర్కటరూపంబు విడిచి భల్లూకాకారము ధరించినన్ను మ్రింగ వచ్చుచున్నది. భల్లూకంబును దెచ్చినాకు గట్టిబెట్టుచుంటిరేమి ? అక్కటా నాకుఁబెండ్లియక్కరలేదు (పెండ్లికూతురునుఁ జూచి) ఓభల్లూకమా ! నేను నీజోలికిరాను. నీకు మ్రొక్కుచున్నాను. నన్ను మ్రింగరాకుము. (పాఱిపోవుచున్నాఁడు.)

విష్ణుశర్మ—(బలరాముని జూచి) బలరామా ! కూతురునకు బహు మంచివరునిఁ గూర్చితివయ్యా !

బల—(తనలో) నవ్వువారికి నవ్వుసందైనది. దెప్పువారికి దెప్పుసందైనది.

రేవ— నాథా ! ఏమిగ్రహచారమిది.

బల— రమణీ ! మనప్రారబ్ధమిట్లున్నది.

దుర్యో—(లక్ష్మణునిదీసికొనివచ్చి పీటపైగూర్చుండఁజేసి) నాయనా భయపడకుము. ఇంతమందివీరులుండగా నీకేమి భయము ?

లక్ష్మ—అయ్యో ! నన్నేల బలవంతపెట్టెదరు. అదిగో ! భల్లూకావతారము వ్యాఘ్రింబుక్రింద మారినది. అయ్యలారా ! నాకవివాహమక్కరలేదు. ప్రాణములున్నచో బలుసాకయినన దినవచ్చును. నన్నుఁ బోనీయుఁడు. మీకు నమస్కారము లాచరించెదను.

భీష్మ—(ద్రోణునిఁజూచి) ఆచార్యవర్యా ! ఏమిదింతయిది .

ద్రోణు—ఇదియంతయు బలరామకృష్ణులు బన్నినమాయగానున్నది.

భీష్మ—నాకును నట్లే తోచుచున్నది.

దుర్యో—పితామహా ! ఏమిదీ !

భీష్మ—ఏమియోమాకును దెలియకున్నది. ఇందుకుఁగారణం బెఱుఁ
గరాకున్నది.

దుర్యో—అక్కటా ! నలువురిలో నగుబాట్లయ్యెనుకదా ! (కుమారు
నిజూఁచి) లక్ష్మణా ! చిత్తఁబు పదుపఱచుకొని శశిరేఖఁ
జూడుము.

లక్ష్మ—అయ్యో ! నన్నుఁ జంపదలంచితిరా! అదిగోవ్యాఘ్రము నో
రు తెఱచుకొని నామీదికి వచ్చుచున్నది. అక్కటా ! నన్నుఁ
జంపిన మీ కేమిలాభము వచ్చును ? రక్షింపుఁడు. రక్షింపుడు.
(పీటమీఁదనుండి లేచిపోవుచున్నాఁడు.)

శశి—(లక్ష్మణునివెంటనంటి) హా ! మనోహరా ! సుయోధనాత్మజా !
ఎచ్చటికి బోయెదవు ? పతిమార్గంబునే సతిగూడ యవలంబిం
చ వలయునుకదా ! నీరూపరేఖలావణ్యాతిశయంబులం గూర్చి
యెందరో చెప్పగావిని యుంటినేగాని కన్నులారనిది వఱకెన్నఁ
డును వీక్షించి యుండలేను. ఇప్పుడుతిలకించితిని. ఆహా ! నీ
యట్టిభర్త దొరకినందులకెంతయో సంతసింపుచుంటి. నన్నుఁ
జూచి భీతిఁజెంది పరుగిడెదవేల ? రమ్ము. రమ్ము. నన్ను జేప
ట్టుము. (అనిలక్ష్మ ని నొకదెబ్బగొట్టి ఘటోత్కచాకారము
ను ధరించును.)

ఘటో—ఓరోరీ ! దుర్యోధనా ! దుశ్శాసనా ! కర్ణా ! ఎందుబోయె
దరు. వివాహకార్యార్థమై యరుదెంచిరిగా ! నిలునిలుడు.

దుర్యో—భీష్మద్రోణులారా ఇంతవరకును మాయరక్కసుండని
యెఱుంగక పోయితిమకదా !

బల—ఆయ్యో ! మాశశిరేఖయేది !

రేవ—శశిరేఖా ! శశిరేఖా ! (బల, రేవ, నిష్క్రమించుచున్నారు.)

ఘటో—

శా. ఓరీ కౌరవపాంసనా నిలువుమీ! ఓరీ దుశ్శాసనా!
పారంబోకుము; ధైర్యమూనుమిక నీ భావంబుం గర్ణుడా!
చేరన్ వచ్చెను భీమనందనుఁడిదే చెండాడఁగా మిమ్ములన్
నాకీరత్నము నిచ్చి లక్ష్మణుఁ గురున్ గావింతు జేపెంచిలిన్.

దుర్యో—కర్ణా! వీఁడెవఁడో మాయరక్కసునివలె నున్నాఁడు. ఇప్పుడు కర్తవ్యమేమి?

కర్ణ—వీనిమదము దూలించుటయే.

ఘటో—ఓరీ! దురాత్ములారా! మదముదూలించుటయా కర్తవ్యము.

మ. మును తాతండ్రులు చేసినట్టి సమయంబున్ జ్ఞప్తి యుంచుంటచే
ఘనసంగ్రామతలంబునందు మిములన్ గారింపఁగాకుండినన్
ఘనవైవాహము సేయఁగా మనములోఁ గాంక్షించి మోసెంచు మి
మ్మను దున్మాడక యుంచునే రణములోఁ బూర్ణప్రతాపంబునన్

మ. ఇఁక నైనన్ మదిబుద్ధి తెచ్చుకొని నీ వేమాత్రమున్ నిల్వకన్
బ్రికట ప్రాభవమెల్ల వీడిచనుమీ పట్టంబునుం బాంధవ
పరికరంబుల్ గొలువంగఁగా నియెడ నా స్మర్త్యుగ్రనారాచ జ
లకతో రాహుతిఁ ద్రెళ్ళ నేతు నిను నాలంబున దుర్యోధనా.

(దుర్యోధనాదులను దఱుముచు నిష్క్రమించుచున్నాఁడు.)

[శ్రీకృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు]

కృష్ణు—(తనలో) అన్నా! ఎంతచిత్రము జరిగినది. అగ్రజుండు శశిరేఖను నభిమన్యునకీయక పోవుటచేతనేకదా యిట్లైనది సుయోధనాదులకు జక్కని పరాభవము జరిగినది. (ప్రక్కం జూచి) అదుగో! అగ్రజుండగు బలరాముఁడిట్లు వచ్చుచున్నాఁడు.

[బలరాముఁడు ప్రవేశించుచున్నాఁడు.]

బల—(కృష్ణునిఁజూచి) తమ్ముఁడా! గోపాలకృష్ణా! ఇదియంతయు మాయగనున్నది. శశిరేఖ మెచ్చుటను గానుపించుటలేదు. అభిమన్యునకుఁ బిల్లనీయక లక్ష్మణునకీయ నెంచినందుల కీట్టిఫలంబనుభవించితి. సుయోధనాదులు నిజపురంబునకు బోరి. ఇప్పుడేమిసేయుదము? నీకుగోచరముగాని విషయంబీచతుర్దశభువనంబులయందేమియు లేదు.

కృష్ణు—అగ్రజా! ఇందేమియు వింతలేదు. ఇట్టిమాయచేసిన మహావీరుండు, భీమసేననందనుండగు ఘటోత్కచుండు. ఇంతకుమున్నే యాతండు మాయాబలంబుచే శశిరేఖనుగొనిపోయి తన యాశ్రమంబుననున్న యభిమన్యు సుభద్రలయొద్దనుంచి యాతడే శశిరేఖాకృతిందాల్చి యిట్టిచిత్రములు చేసెను.

[తెరలో]

శా. నాతమ్ముండభిమన్యువీడి యిటులన్ నారీశిరోరత్నమున్
జేతోమోదముతోడ లక్ష్మణునకున్ శీఘ్రంబుగా బెండ్లి వి
ఖ్యాతిన్ జేయఁదలంచినాడవె యసత్యాచారివై, కౌరవ
వ్రాతం బేమొనరించెనో తెలిసెనే భాగ్యంబు జేకూరెనే.

బల—కృష్ణా! ఘటోత్కచ మహాకోపదవానలంబు జల్లార్పుటెట్లు?

కృష్ణు—ఆతనిని శాంతిపఱచుటకు ముక్కంటియైనను శక్తుండుగాడు.

[తెరలో]

ఓహో! బలరామా! బాల్యంబునుండియు మీయింట బెఱిగిన మేనల్లుండగు నభిమన్యునకు గన్యకనిత్తునని వాగ్దానంబుజేసి యిప్పుడసత్యవాదివై సుయోధనాత్మజునకిచ్చి వివాహము సేయనెంచితివా! వివాహమహోత్సవము బాగుగా జరగినదే. నీసోదరియగుసుభద్ర నెంతక్షోభ పెట్టితివి. బాంధవ్యమునువిచారించి యూరకుంటిని. ఇప్పుడైన

ను నీయిష్టము౦డెనేని సత్వరమ్ముగ నాయాశ్రమంబునకువచ్చి శశిరే
ఖాభిమన్యులకు వివాహము చేయుము.

బల—(కృష్ణునిజూచి) కృష్ణా! ఏమికర్తవ్యము.

కృష్ణు—అగ్రజా! ఘటోత్కచుని యిష్టప్రకారము సేయుటయేకర్త
వ్యము.

బల—(ఆకసమువంకఁజూచి) వత్సా! ఘటోత్కచా! మేనల్లునివిడిచి
కన్యనునొరులకీయనెంచినందుకు ఫలంబనుభవించితిని. ఇక నీ
యిష్టప్రకార మాచరించెదను. కోపదృష్టిమానిప్రసన్నుఁడవ్రు
కమ్ము.

[అకసమున]

ఏవు మహాయసత్యవాదివి నీనుడులునమ్మరాదు.

కృష్ణు—(ఆకసమువంకఁజూచి) హిడింబాత్మజా!

కవిరాజవిరాజితము.

వినుమిదెనాదగు పల్కులదప్పక వేడ్కతొనీదగు మాటవయిన్
వనితనుసీదగు తమ్మునకిచ్చి వివాహముసేయును నగ్రజుడున్
మనమునకోపముమానుము శాంతముమానుగబూనిముదంబుమెయిన్
ననుగసరమ్మిక నగ్రజుమాటల నమ్ముము నమ్ముము భీమసుతా.

ఘటోత్కచుఁడు-(ప్రవేశించి చేతులుమోడ్చి)

[కృష్ణునిచూచి ఘటోత్కచుడు పాడెడిపాట.]

మోహనరాగం—ఆదితాళం.

ప॥ వందనమిదెగోనునందనందనా। వందిమాగధ వినుతా ముకుం
దా॥ వంద॥

అ॥ ప॥ సుందరవిగ్రహా। శంఖచక్రధర। చూడగంటివినుయానంద
మొదవ॥ వంద॥

యొందరెందరోయీవసుంధరకా । వింతగనినుగొని యాడగవింటిని ॥
వందన॥
డెందమమందానందమొందగను । దేవాప్రత్యక్షమైతి విప్పుడు ॥
వందన॥

మాలిని.

దనుజకులవిదారీ ! ధైర్యధౌరేయమూర్తీ
దినమణిసమతేజా ! దేవతాలోకవంద్యా
ఘనయదుకులదీపా ! కంజనేత్రాశుభాంగా
మునినుతపదపద్మా ! భూరిసంతోషభావా.

(అని కృష్ణునకునమస్కరించుచున్నాడు.)

కృష్ణు—వత్సా! ఘటోత్కచా! నీసాహసకార్యంబునకుసంతసించితిని
ఘటో—దేవా! దేవరయగ్రజుండగు నీబలరాము డభిమన్యునివీడి, త
నకుమారి నొరులకీయదలంచినందున నింతకార్యంబు సలిపితిని.
నాచేసినతప్పులెల్ల మన్నింపవేడుచున్నాను.
బల—ఘటోత్కచా! అందుకుఫలంబనుభవించితిని. శశిరేఖ సుఖము
గనున్నదికదా.
ఘటో—అయ్యా! నాయాశ్రమంబున సుభద్రాభిమన్యులచే రక్షిం
పబడుచున్నది. ఇంక మనమందరమును నచ్చటికేగి శశిరేఖా
భిమన్యుల వివాహంబు నెఱప వేడుచున్నాడ.
బల—వత్సా! నీయభీష్టమెట్లో యట్లే కానిమ్ము.
కృష్ణు—ఘటోత్కచా! ముందునీవేగి వివాహప్రయత్నము సేయు
ము. మేమును సత్వరముగ వచ్చెదము.
ఘటో—చిత్తము. (అందరునిష్క్రమింతురు.)

ఇది చతుర్థాంకము.



శ్రీ

# శశిరేఖాపరిణయము.

## పంచమాంకము.

—oo:o:oo—

### ఘటోత్కచాశ్రమము.

[ప్రవేశము:—హిడింబ, సుభద్ర, శశిరేఖ, అభిమన్యుఁడు.]

ద్వారకకేగిన ఘటోత్కచుని రాకంమున సుభద్రపాడెడిపాట.

హిం॥ తోడిరాగం—ఏకతాళం.

ప॥ యేలనోమనఘటోత్కచుండు । యింకనూరాడాయె నేమయ్యెను
యేల॥

అ॥ జాలముసేయక । సత్వరంబుగ । చనుదెంచెదనని జనెనిర్భ
యమున॥ యేలనో॥

వేలకొలది । యోధులుగల్గిన । కౌరవాధముని । చేజిక్కెనోమరి
బాలామణిశశిరేఖకొఱకు యే । బాధ లొందు చున్నాడో । దలపగ॥
యేలనో॥

సుభ—అక్కా! ఘటోత్కచుండు ద్వారకానగరంబునకరిగి కడుదడ
వైనది. ఇంతవరకును రాలేదు. నాకేమియుఁ దోచకున్నది.

హిడిం—చెల్లెలా! డెందంబునసందియంబంద నవసరము లేదు. ఆతడి
ప్పుడేరాగలఁడు అతనికేమియు భయముండదు.

సుభ—ఆకౌరవులచే నేమిచిక్కులుపడుచుండెనోయని భయముకలుగుచున్నది. అంతమంది మహాయోధులలో నితండొక్కఁడేమి సేయఁగలఁడు?

హిడిం—వెఱ్ఱిదానా! ఘటోత్కచునిబలంబును నీవెఱుంగవు. మహామాయా బలసంపన్నుఁడు. సంగ్రామరంగంబున నాతనిని తేఱిపాఱఁ జూచుటకు త్రిశూలపాణికైనను తరంబుగాదు.

అభి—సోదరుసకట్టిచిక్కులు తటస్థింపఁజేయుటకు నేనేకదా కారణము. నేనునుగూడ నేతెంచెదననిపలుకవలదని వారించుటచే నూరకొంటి. అందులకిప్పుడు సంశయింపనేల. నేనీక్షణంబునందే ధనుర్ధరుండనై ద్వారకాపురంబునకరిగి, యాదవకౌరవబలంబులను గాండీవీకులం జేసి, సోదరునిదోడికొనివచ్చెద.

హిడిం—వత్సా! అభిమన్యూ! నీవంత పరాక్రమవంతుడవే యగుదువు కాని యంతవరకవసరములేదు. నీయన్న యిప్పుడేరాగలడు.

[అంతఘటోత్కచుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

ఘటో—(తనలో) ఆహా! పాండవులనుదూషించి తనకన్నియను నభిమన్యునకిచ్చుటకు సమ్మతింపక, దుర్యోధనాత్మజునికిచ్చి పెండ్లిసేయఁదలంచిన బలరామునకును, నింటమేనల్లుఁడున్నాఁడని యెఱుంగక, శశిరేఖను తనకుమారునకుఁ జేసికొనదలంచి వివాహమునకై తరలివచ్చిన దుర్యోధనుండును సంపూర్తిగ నాచేఁ బరాభవమందిరికదా. నేనాచరించిన చిత్రములన్నియు నభిమన్యుఁడు జూచియుండినచో నెంతైన సంతసించియుండును, అదుగో శశిరేఖాయుతంబుగ నాతల్లులు నారాకకై యెదురు జూచుచున్నట్లున్నారు. (సుభద్రా హిడింబలఁజేరి) తల్లులారా! నమస్కారములు.

సుభ—వత్సా ! ఘటోత్కచా ! మరలనాకంటబడితివా ! నీవరిగిన దాదిగ మరలనెప్పుడుగ్రుత్తువో లేక, నాదుష్టకౌరవులచే నేమి యపాయంబు వాటిల్లునోయని భయంబుఁదుచుంటి. నిన్నుఁ జూడగనేనాకు మహానందంబు జనించినది. కుమారా ! ఆకౌరవులనుండి యెట్లు తప్పించుకొని వచ్చితివి ! ఏమేమిచిత్రము లు గావించితివి !

ఘటో—అమ్మా నేను గావించినమాయలు చెప్పుటకునాకు పదములుచాలవు. చూచితీరవలయును. అమ్మా ! ఏమి చెప్పుదును. మీయనుజ్ఞవడసి యిచ్చటనుండియరిగి, ద్వారకాపురంబునుజొచ్చి మాయాబలంబున నేనే శశిరేఖాకృతిందాల్చి, శశిరేఖాసౌధంబున నభిమన్యునకై విచారింపుచు నుండియుంటిని.

సుభ—వత్సా ! ఎంతమాయచేసితివి ! తరువాత,

ఘటో—తరువాత, శశిరేఖచెలికత్తెలువచ్చి నన్ను నిజమైనశశిరేఖయేయనితలంచి యెంతయోయూరడించి యెట్టకేలకు పెండ్లిపీటలమీద గూర్చుండ దీసికొనిపోయిరి.

సుభ—ఆహా ! ఏమిచిత్రము. తరువాత,

ఘటో—తరువాత నేనా పెండ్లికుమారుండగు లక్ష్మణున కనేకవికృతరూపంబులుగా గనబడి యతనికతిభయముపుట్టించి పెండ్లిపీటపైనుండి పాఱిపోవునట్లు గావించితిని. అంతనేను నిజరూపంబునుధరించి కౌరవవ్రాతంబును నిజపురమార్గంబును పట్టునట్లు గాందిసీకులం జేసితి. తరువాత బలరాముం డిదియంతయు కృష్ణునకెఱింగింప నమ్మహానుభావుం డిదియంతయుఘటోత్కచుని మాయయనిచెప్పి యతనిని బ్రతిమాలుకొనుమనెను. ఆ బలరాముం డట్లుగావింప, నేనునేలకుం దిగివచ్చితిని. ఇది వై

వాహికచిత్రము. బలరాముండు శశిరేఖను నభిమన్యునకిచ్చు
కే సమ్మతించెను. వివాహమిక్కడనేజరుగును బలరామకృష్ణు
లిచ్చటికిప్పుడువత్తురు. (హిడింబంజూచి) వివాహప్రయత్నము
లన్నియు గావింపఁబడెనుకదా.

హిం—ఇంతకుమున్నే గావింపబడినవి.

అభి—తే. గీ. అగ్రజానాకునై శ్రమ । లందియుండి
కౌరవాత్రతమును నెల్ల । బారద్రోలి
కోమలాంగినినాకును । గూర్చినావు
సఖుణం బెట్లుదీర్తును । నిక్కముగను.

ఘటో—తమ్ముఁడా ! నీవట్లనఁజెల్లదు. మన మొరులమ్ము కామకదా.
మగో బలరామకృష్ణులు, బంధుసమేతంబుగ వివాహంబున
వచ్చుచున్నారు.

[బలరామకృష్ణులు రేవతి మొదలగువారు ప్రవేశించుచున్నారు.]

అభి—(బలరామకృష్ణులకు నమస్కరించుచున్నాఁడు.)

కృష్ణ—చిరంజీవ. చిరంజీవ.

సుభద్రనుజూచి బలరాముడు పాడెడిపాట.

కన్నడరాగం—ఆదితాళం.

ప। చెల్లకుం కెమోహము । నినుజూడఁగ ॥ చెల్ల ॥
అ॥ ప॥ చెల్లెలానిన్నుదూషించితిననిచిత్తమునం దిసుమంతయునుంచ
యెల్లవిధంబుల । నెంచగతగుమే । నల్లునివిడచి అన్యులకు నా
పిల్లనొసగినే । నల్లరిపాలై । పేరాశనునిను జేరితినమ్మా ॥ చెల్లకుం
బల—(సుభద్రంజూచి) చెల్లెలా ! మేనల్లునివిడచి యన్యునకుంబిల్ల
యదలంచి, నిన్నెన్నియో దుర్భాషలాడినందుకు సన్ను
రింపుము.

—అగ్రజా ! విధివశంబుననట్టిది సంభవించెను. గతించినదాని నిప్పుడుదలంపనేల !

—(శశిరేఖనువిలోకించి) అమ్మాయీ ! శశిరేఖా !

తే. గీ. మొదటినుండియు మదిలోన భూరిగుణుని
అర్జునాత్మజుగోరి యు న్నందుకిప్పు
డతనికే కాంతవౌచును నలరినావు
నీదుకోరిక నెఱవేఱె నిశ్చయముగ.

(మన్యునివిలోకించి) అభిమన్యూ ! నీకోరిక నెఱవేరినది.

చుకయూరకుండి) అదిగో ! శశిరేఖాభిమన్యుల వివాహంబునకు దేవేంద్రుండుగూడ నరుదెంచుచున్నాఁడు. ఇప్పుడుగదా మన భాగ్యము ఫలించినది.

వేంద్రుఁడు ప్రవేశించుచున్నాఁడు. అందరును నెదురేగి తోడ్కొని వచ్చుచున్నారు.]

—విబుధలోకేశ్వరా ! ~~నీవా ఈ~~ండగు నీతనివివాహంబునకు వృస్వయముగ విచ్చేయుటంజేసి మేముకృతార్థులమైతిమి. నీర క వివాహంబునకు మరింతశోభకు గారణంబైనది.

దుి—సాక్షాద్విష్ణుస్వరూపుండవగు నీవునన్నట్లు శ్లాఘింపవలదు.

ల—దేవేంద్రా ! ఘటోత్కచునికారణంబున మిమ్ముదర్శింపగంటి మి. ధన్యులమైతిమి.

దుి—వివాహకాలమైనది. ఇంకనాలోచింపనేల ?

ల—(శశిరేఖంజూచి) అమ్మాయీ ! బాల్యంబాదిగ నీవుకోరినవ రుఁడే లభించెను.

తే. గీ. పతినిదైవంబుభాతిని మదిఁదలంచి
యతడు చెప్పినచొప్పున నలరుచుండి
పుడమియందున జనములు పొగడునట్లు
యుభయకులములకును గీర్తి యువిద తెమ్ము.

(శశిరేఖచేయి యభిమన్యునిచేతిలోనుంచును వధూవరులు పుష్పమా
లిక లొండొరులు వైచికొందురు.)

బల—(వధూవరులచే నింద్రునకును గృష్ణునకును నమస్కరింపఁజే
యుచున్నాడు.)

కృష్ణు—అభిమన్యూ! మీయిరువురికోరికలును ఫలించినవి. ఇంక నేమి
కావలయును?

అభి—ఇంకగావలసిన దేమున్నది. అయిననిట్లగుఁగాక.

ఉ. మానిని మానసం బెవరిపై ననుజిక్కునో దానిజూచి, స
న్మాన మెలర్పగా దగిన భర్తను దెచ్చి వివాహకార్యముల్
మానక దల్లిదండ్రులు స మంజసబుద్ధి నొనర్త్రుగాక స
న్మానములుగొల్చు నీదుపద పద్మములన్ భజియింతు రెల్లరున్.

[సమాజకులందరు కలసిపాడెడి హారతిపాట.]

కేదారరాగం—ఏకతాళం.

ప॥ హారతిఁగైకొనుమా। జయ। హారతిఁగైకొనుమా॥

అ॥ ప॥ ఓరజితగిరీంద్రుని ప్రియభామా। యోగీశ్వర హృత్సరోమ
రాళీ॥ హారతి॥

ఓరమణీయవిలాసిని త్రైలోక్య। జననీ। గనుమీ। కృపాదృష్టిని॥హారతి॥
భారతప్రజలైకమత్యవ్రతులై। స్వరాజ్య యుతులై వరలగ। బ్రో
వ॥ హారతి॥

సంగీతశశిరేఖాపరిణయమునందలి
పాటలు సంపూర్ణము.

ఇంద్ర—తథాస్తు.

(అందరును నిష్క్రమించుచున్నారు.)

ఇది పంచమాంకము.